# కృష్ణకథ

శ్రీ రామకృష్ణానందస్వామి

(ఆంగ్లము నుండి)

అనువాదము

అంబటిపూడి వెంకటరత్నం

విరోధి

కృష్ణాష్టమి

శ్రీరస్తు చిరంజీవి వోగ్గవరపు పెద అమ్మయ్య ఆంగ్లగీర్వాణాంధ్ర భాషలలోని గ్రంథజాలమును నిశితముగ జూచినవాడు. శాంతస్వభావుడు. ఉదారుడు. అతని అంతరంగము లోతుగలది. ప్రాచ్యపాశ్చాత్యముల రెంటిని అవగత మొనర్చుకొని ప్రాచ్య వైభవమును గమనించినవాడు. అతని విద్యారంగమున కొంత నా దోహద మున్నను స్వయంకృషి వివేకసూక్ష్మత అతనిని పెద్ద జేసినవి. 'కృష్ణకథ' వినినాడు. ముద్రింపమనినాడు. ఇట్టి వానిని గనిన వెంకయ్యగారిలో ఆ లక్షణములు పాదుగొని పుత్రునిలో పూచి వికసించినవి. 'స పితుః పిత్ర్య న కేవలాం శ్రియమ్ ప్రతిపేదే సకలాన్ గుణా నపి.' దీని ప్రచురణకైన ధనము నిచ్చినట్టియు పెద అమ్మయ్య వంటి కుమారుని గన్నట్టియు వాని అభివృద్ధికి సర్వవిధముల కారణ మైనట్టి శాంతసౌజన్యమూర్తి శ్రీ వోగ్గవరపు వెంకయ్యగారికి నా కృతజ్ఞత.

మొదటినుండియు నా రచనలను ప్రకటించుచు ఎప్పటికప్పుడు ఉత్సాహము కూర్చుచున్నట్లే 'కృష్ణకథ' ను గూడ తమ పత్రికలో బ్రకటించి నన్నాదరించిన శ్రీ ఆంధ్రపత్రికాధిపతులకు నా కృతజ్ఞతాభివాదములు.



పుస్తకరూపము బొందిన ఈ 'కృష్ణకథ'ను శ్రీ స్వామి పూర్వము జన్మాష్టమిసందర్భమున నుపన్యసించిరి. శ్రీరామకృష్ణ పరమహంసకు సాక్షాచ్ఛిష్యులైన స్వామివారి భక్తి జ్ఞానము పాండిత్యము బుద్ధినైశిత్యము కృష్ణకథలో వెల్లడి యగుచున్నవి.

నేటికాలమున శ్రీకృష్ణుని జీవితమునుగూర్చి వచ్చు ప్రశ్నలకు తగు సమాధానము లొసంగి భారతీయ తాత్త్వికదృష్టిని యువకులలో నిది ప్రేరేపించగలదు. శ్రీకృష్ణుని రూపము దేవత్వముయొక్క మూర్తి. శ్రీకృష్ణుని గీత సకలవేదాంతముల సారము. కావున శ్రీకృష్ణుని కథ సూత్రప్రాయముగా పాఠకులలో భాసించవలెనను ఉద్దేశ్యముతో భాగవత భారతములం గల కృష్ణచరితము నిచట క్లుప్తముగా సవిమర్శకముగ చూపబడినది.

ఈ ఆంధ్రానువాదమున నా యోపిన జాగరూకత చూపితిని. దోషజ్ఞులు చూపు లోపములు సవరించుకొన యత్నింతును. ఇహపర సాధనమైన్న పరమాత్మ కథ యగు కృష్ణకథ నాంధ్రపాఠకలోకమున కర్పించుటయే ఆంధ్రికి నేడు నే నిచ్చు భక్త్యంజలి.



# ఒక మాట

సాహితీమేఖల ఇరువది రెండు సంవత్సరముల క్రింద ప్రారంభమై ఇప్పటికి పదునాల్గు గ్రంథములు ప్రకటించినది. శ్రీ కవిరత్న అంబటిపూడి వెంకటరత్నంగారి ప్రణయవాహిని, మైనాదేవి, మొరాన్‌కన్య, వత్సలుడు, వనవాటి, దక్షిణ, వీరాంజలి, ఇంద్రధనుపు, చంద్రశాల, కథావళి, కౌమోదకి అను గ్రంథములు. శ్రీ దాశరథి కృష్ణమాచార్యులుగారి అగ్నిధార, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి తెలుగుదేశము, పండిత నెహ్రూ జీవితము అనునవి ఈ సంస్థయొక్క ప్రకటనలు.

పై గ్రంథములన్నియు తెలుగునేలయం దంతట సుప్రసిద్ధ సాహితీపరుల సమాదరణలను చూఱగొన్నవి. వత్సలుడు, ద్వితీయ ముద్రణమును పొంది విశారదకు పాఠ్యమైనది. ఈ ప్రచురణలన్నియు తిరిగి ముద్రించవలసియున్నది.

సాహితీమేఖల పుస్తకప్రచురణలతోపాటు పెక్కు సారస్వత సభలు జరిపి ప్రజలలో సారస్వతాభినివేశమును మాతృభాషాభిమానమును రేకెత్తించినది. ఈ సంస్థ జరిపిన సభను తెలంగాణమున సారస్వతోద్యమ వ్యవసాయమునకు తొలకరిజల్లు లయినవి.

ఆంధ్రసారస్వతప్రాంగణమున ఒక విశిష్టసంప్రదాయమునకు రంగవల్లులు తీర్చిన ఈ సభలు తెలుగుదేశమందలి ప్రఖ్యాతపత్రికల ప్రశంసలకు పాత్రము లగుట గర్వకారణము. తరువాత తెలంగాణములో ఖ్యాతి గడించిన భాషాసంస్థలు తమ సభలు కవిసమ్మేళనములు జరుపుటలో ఈ సంస్థ వేసిన తెన్నులనే అనుసరించిన వన్నచో సత్యమున కావంతయు అపచారము జరుగదు. రచయిత లేని రచనయే యుండదు.

రచయితను ప్రోత్సహించినగాని ఉత్తమ రచనలు బయలుదేరవను సత్యమును గుర్తించి ఆంధ్రసాహితీవేత్తలను సన్మానించి సమర్పించుటలో ముందంజవేసినది సాహితీమేఖల. ఈ సంస్థ పుట్టుకగొన్న చండూరుప్రాంతమున పత్రరచనలలోని రూపకము లుచితముగ ప్రదర్శింపబడి యువకులైన విద్యార్థులలో సాహితీచైతన్యము గలిగింపబడినది. సుప్రసిద్ధచిత్రకళాకారులయిన, తిరుమలరావుగారు, కొండపల్లి శేషగిరిరావుగారు, గిడుతూరి సూర్యనారాయణరావుగారు సాహితీమేఖల ప్రకటించిన గ్రంథములలోని చిత్రములు వ్రాసియిచ్చిరి. వారి సహకారము మాకు పూర్తిగా గలదు. చండూరు నందలి సేవాసమితి ఈ సంస్థయం దంతర్భాగము.

పఠనమందిరము, గ్రంథాలయము, పాఠశాలలను ఈ సమితి నిర్మించుకొనుచున్నది. 'మమాత్మా సర్వ భూతాత్మా' అను దివ్య తత్త్వమును దరిద్రనారాయణసేవాసమితి యథాశక్తి ఆచరణలో ప్రచారము జరుపుచున్నది. ఇప్పుడు సాహితీమేఖల గీతాచార్యుడైన శ్రీకృష్ణుని కథను ప్రకటించుచున్నది. సరసహృదయులైన ఉదారులు మాకు తోడ్పడుచున్నందుకు వారికి మా కృతజ్ఞతాభివాదములు. సహస్రదళపద్మసంశోభితయై కరుణామయియైన సాహితిని సమర్చించుటలో మా మేఖల తన చిరుమువ్వల మవ్వంపురవళులు దివ్యశబ్దప్రచారితములుగా తెలుగునేల నలుదెసల నేటిదనుక కాలాను సారముగ ప్రపంచించియున్నది. ఆధ్యాత్మవికాసము ఆత్మవిశ్వాసము దృఢత నొందవలసిన నేటి దేశకాలముల అవసరమును బట్టి ఆంధ్ర పాఠక సోదరుల కందించుచున్న ఈ రీతి రచనలకు సమాదరణము లభించునని మా విశ్వాసము.

చండూరు,
వికారి కృష్ణాష్టమి.

పులిజాల హనుమంతరావు,
వ్యవహర్త, సాహితీమేఖల.

# గోకులము

సర్వకాలములయందును జగతిపై సుఖానంతరము దుఃఖమును దుఃఖానంతరము సుఖమును సంభవించుచున్నను, మానవు డీ రెంటిలో నొకదానికి వశుడైనవేళ ఉత్కటమగు దాని ప్రభావమున ఆ దుఃఖమునకో ఆ సుఖమునకో యిక పారమనునది లేదని భ్రమించును, విశ్వసించును. ఈకారణముననే కష్టసాగర మనదగు నీజగమున ప్రకృతి యాదృచ్ఛికముగ తన లుబ్ధహస్తము నెత్తి విసరగా కందుకముభంగి గబ్బున వచ్చిపడిన ఈ సుఖలేశమును మానవుడు తనివిదీర నారగించుచున్నాడు; కావుననే జీవితమతనికి రమింగదు ప్రియము: ఈ కారణముననే బంధసంభూతములగు నీ సుఖములు నశ్వరములు క్షణభంగురములు మరీచికాసన్నిభములునై హేయములు జుగుప్సితములు అగుటకు మారుగ మానుష్యక మంతటికిని భ్రాంతిజనకములు ఆకర్షకములు అగుచున్నవి : ఈ కారణముననే ఆపన్నిమగ్నుడైన జనుడు విధివిరామములు లేక ఆశల బోనాకి తా నా దుఃఖాబ్ధి నిక దాటలేనని నిరాశాహతుడై అల్లాడుచున్నాడు. మానవుని అదృష్టమును దిద్దెడి ఈ విరుద్ధశక్తుల రెంటి విజృంభణములను ప్రశాంతముగ డీకొనగలవాడు అధ్యాత్మతత్త్వభాసితు డొక్కడే. సామాన్య మానవుడు యథార్థము నెఱుంగునది సంధివేళల; అనగా సుఖభోగముల దశ దుఃఖదశ కవకాశ మిచ్చు సమయమున, అట్లే దుఃఖకాలము గతించి సుఖ మబ్బు అవసరమున; భావి ఫలమును గూర్చి ఉద్రేక ముత్కటమగు గడియలవి. అట్టి త్రుటులలో ఈ విశ్వము నశ్వరమని, దీని బంధముల నుండి విడివడవలయునని క్షణికమగు కోర్కె రేకెత్తును. క్షణిక మేల? ఏలనన, అట్టి మహోద్రేకము నిజముగ క్షణమునకంటె మిగిలి నిలువ జాలదు.

ఇవ్విధమైన సంధిఘటిక ఒక్కటి హఠాత్తుగ అనుకొనకయే సంభవించిన దొక నవవధూవరయుగళముపాలికి. అయ్యిరువురు నిరాడంబరులు సుందరులు కాని ఉన్నతులు తేజోవిరాజితులు; వారు కోమలులు సుకుమారులు, అయినను గంభీరులు స్థితప్రజ్ఞులు. ఆ వేళ యెట్టిది ? కళ్యాణమహోత్సవానంతరము వరునివెంట వధువు నొక రథముపై బంపు తఱి. వజ్రవైడూర్యాదిబహువిధరత్నశోభితమై చిత్రాలంకారభాసుర మా రథము. రథమువెంట విలువైన వన్నెవన్నెల దుస్తులు ఒక్క మదువున ధరించి పెండ్లి కట్నములను కొని వచ్చుచున్న పారములేని పరిజనపరివారము. అహో ! వెండి బంగారు మరకత మాణిక్యాదిరత్నరాసులు దివ్యరథముల కెత్తబడినవి. పసిడి జలతారు నగిషీ గవుసెనలతో మెఱయుచున్న మత్తగజాశ్వములు శ్రేణులుగట్టి వచ్చుచున్నవి. ఈ మహోత్సవమున కధిష్ఠాతలైన దంపతులలో వధువు దేవకి, వరుడు వసుదేవుడు. రథసారధియు ఇయ్యిరువురికంటె తఱుగైన వాడు కాడు. అమ్మహోత్సవమునం దందఱికంటె మిగులుగ రాజ చిహ్నములతో నొప్పుచు శిరమున మణిఖచితమైన స్వర్ణకిరీటము వెలుగొంద క్షాత్రగాంభీర్యములను వెలిగ్రక్కు దృక్కులచే నాత డా నేల కేలిక యని తెల్లమగుచున్నది, అతనిచేత గుఱ్ఱముల పగ్గములున్నను. ఎవ్వని నామ ముచ్చరించినంత మాత్రమున శాంతిప్రియములైన సజ్జన హృదయములు గుభేలున త్రుళ్ళిపడునో నిరంకుశచక్రవర్తిగా కీర్తి నొందిన దే డాతడు కంసుడు. నవవధు వా దేవకి వాని సహోదరి. ఆమెపై నాతని వాత్సల్యమునకు మేర లేదు. కావుననే నా డాత డామెను భర్తతో నత్తవారింటి కంపుటకు సన్నద్ధమైన రథమును స్వయముగ తోలుట కుద్యమించినాడు.

దేవకీవసుదేవుల సంతోషసౌధగోపురాగ్రములు మి న్నంటినవి. పరరాజభీకరుడగు కంసనరపాలుడు వారికి రథచోదకుడు. ఇక చింతకు

తా వెక్కడ ? మందమారుత మొకటి కుసుమపరిమళమును తోడుకొని వారికి వింజామరలు వీచినది. తరుశాఖల కలకలధ్వనుల శకుంత సంతతులు స్వాగతగీతు లాలపించినవి. ఉదయభానుడు కవోష్ణరశ్మల బలపి నిశాశైత్యమున బిగువుగొన్న జంతుజాలముల సంధిబంధముల సడల్చి సౌఖ్య మొనగూర్చెను. సర్వత్ర సౌఖ్యమే తాండవించెను.

ఒక్కుమ్మడి ప్రకృతిముఖమున మార్పు పొడకట్టినది. పిట్టల సద్దు మణగినది. భాస్కరుని మేఘ మాపరించినది. పిల్లగాలి సుడిగాడుపై పెండ్లిసంబరమున దుమ్ములు గ్రుమ్మరించినది. బొల్లిగ్రద్ద లాకసమున గొల్లుమని హాయబట్టినవి. మఱికొన్ని దుశ్శకునములు రానున్న దేదో యిక్కట్టని పరికాణించు చున్నట్లుండెను. నిర్హేతుకమైన భీతి అచ్చోటి వారందఱి మనస్సులలో తిమిరము గ్రమ్మినటులు చేసెను. క్షణము క్రిందట వారి సంతసము అనన్యదుర్లభముగ నుండెను. అయ్యవసరమున నింగినుండి అవ్యక్తకంఠధ్వని యొండు ప్రత్యేకముగ రథసారథియైన రాజు నుద్దేశించి యిట్లు వినిపించెను. "ఓరీ మూర్ఖుడా ! నీ వెవరిని సంతోష ముగ రథముపై నిడుకొని కొంపోవుచున్నావు ?.... ఎఱుగవా ఆమె అష్టమ గర్భమున జనించువాడు నీ మృతికి కారకుడగునని ?" ఈ పలుకులు చెవింబడినతోడనే చివాలున చండక్రోధనుడు కంసుడు ఒఱనుండి కటారు లాగి దేవకింబట్టి కంఠ ముత్తరింపబోవుటం గాంచి వసుదేవు డడ్డుపడి పాదములు తాకి "బావా! నీ కపకార మొనర్చునది దేవకి కాదు కద ! ఆమె అష్టమగర్భసంజాతుడని వింటిమే ! కావున ఈమెను రక్షింపుము. నీ కీమె గర్భములనుండి భయము కలదు గాన ప్రతి బిడ్డను నీ కర్పించెదను. వానిని నీ వేమైనను చేసికొనుము" అని బహుభంగుల ప్రార్థించెను. కంసు డాతని సహేతుకమైన వాక్యముల కంగీకరించెను. ఇక దేవకిని చంపకయే వెనుదిరిగి గృహోన్ముఖుడయ్యెను. దుఃఖదైన్య వికలురైన దేవకీవసుదేవులు తమ్ముంగల వారెల్లరతో గోకులమందున్న

వరుని గృహము జేరిరి. వసుదేవుని సుహృద్వరుడైన యాదవపతి నందుడు ఆనందమున నాతని జూడవచ్చెను. కాని ఆ దంపతుల దుఃఖ గాధను విని తానును పెల్లు దుఃఖోద్విగ్నుడయ్యెను. పిదప నందుడు ఈశ్వరేచ్ఛను గడవ నేరికిని శక్యము కాదని. ఓదార్చెను. ఆ పలుకు లందలి సత్యమును కోవిదుడైన వసుదేవుడు గ్రహించి సహనము వహించెను.

నవవధువైన దేవకి కాక వసుదేవునకు రోహిణి అను నింకొక భార్య కలదు. సుగుణమణులును విధేయురాండ్రును అగు ఇయ్యిరువురు భార్యలం గూడి వసుదేవుడు దుఃఖమును దిగద్రావి శాంతిని సేకరించు కొని నెమ్మదితో కాలమును దొరలించుచుండెను. కొంతకాలమునకు దేవకి కుమారుని గన్నది. వసుదేవుడు తనమాట ప్రకారము కంసునకు కబురంపెను. తత్క్షణమే రాజభటు లరుదెంచి బిడ్డని గొంపోయి కంసున కర్పింప నా కఠినహృదయు డా శిశువును స్వహస్తములతో చావ మోదెను. ఆఱ్గురు శిశువు లదే విధమున అకాలమృత్యువు వాత బడిరి. ఆ కటికజేడు విధిమార్గమును తప్పింప దలచెను. సప్తమగర్భము దేవకియం దగపడి అచట ఫలించక దైవమాయచే రోహిణియందు సంక్రమించి, ఆ కారణమున సంకర్షణుడని విఖ్యాతి వహించిన బాలకుని రూపమును ధరించినది.

తల్లికి పిల్లయందు గల ప్రేమ సహజమైనది. అది గాఢము. ఎంత గాఢ మనిన, పిల్ల ప్రాణమున కపాయము వచ్చినపుడు తన ప్రాణ మర్పింప గలిగినంత. ఇటులు చూచిన మన ఊహల కందవచ్చును దేవకీహృదయము. ఆఱుగురు శిశువులు ఆమె కన్నుల యెదుట యమ భటులవంటి భటులచే లాగికొనిపోబడి, రక్కసివంటి కర్కశహృదయు డైన వ్యాఘ్రరూపు డా సోదరుడు అనుకంపలేక చంపుచుండ ఆ మాతృ హృదయ మెంత శోకసంతప్తమైనదో ! ఎంత బాధాసంకులితమైనదో !

కాలక్రమమున దేవకి అష్టమగర్భమును ధరించుట వినిన కంసుడు ఆ దంపతులను వెంటనే కారాగృహమందు వసించునట్టు లాజ్ఞాపించి, ఇర్వురను ఏకశృంఖలాబద్ధుల గావించెను. పాప మా దీనహృదయులకు దరి తోచకుండెను. ప్రతిక్షణమును వారు దీనపాలకుడని ఆర్తరక్షకుడని భగవానుని కీర్తించుచు మొఱ్ఱ వెట్టుకొను చుండిరి. కాని, ఆ భగవానుడును కారాగారకుడ్యములందలి ఱాళ్ళవలె కఠినుడై నిరుత్తరుడై మిన్నకుండెను. నైరాశ్యమున తరంగితములును దుఃఖసంక్షుబ్ధములును అగు వారి అంతరంగములు కలతనొంది "భగ్నహృదయులైన భక్తులను నీ పాదపంకేరుహముల దరి జేర్చుకొని బాధావిముక్తుల గావించుకట్టడ కడపటి పనికైనను పూనకొనకుంటివే కృపారాముడవగు పరంధాముడా! మా పురాకృతదుష్కర్మము లెంత పాపిష్ఠములో! కారుణ్యజ్యోతివై సర్వేశ్వరుడవైన నీ నుండి దారి తప్పియైనను ఒక్క కరుణరేఖ ప్రసరించకుండునంతటి కలుష మొనర్చితిమా?" అని వగచి వనారిరి, ఎవుంత రాలిపోవు పణుకును ఈ దుష్పరజీవితముల గెంటు కళేబరములను ధరించక తప్పదని స్తబ్ధచిత్తు లయిరి. అక్కటా! వా రేమి చేయగలరు? వారి హృదయములు నిర్మలహిమజలసదృశములు. అట్టి దుష్పరశోకాతిరేకహతి నైనను ఆ కారాగారగాఢాంధకారసంహతి నైనను వా రేమాత్రము భగవానుని దూషించలేదు. ఆయనయందలి విశ్వాసమును వీడలేదు. కాని తాము పూర్వజన్మములందొనర్చిన పాపకర్మముల నిందించు కొనిరి. వారికి విశ్రాంతి లేదు. ఆశ లేదు.

అసితాభ్రములు దట్టముగ నావరించి భాస్కరుని మనకు జూపకుండ ఎన్ని అహోరాత్రము లట్లుండగలవు? అవి గగన మంతయు క్రమ్మిన దినముల మనము విశ్రాంతి నెఱుగక ప్రళయమును శంకించి, ఈ సమస్తచరాచరభూయిష్ఠభూమండలము ఈ విశ్వము విశ్వమే ఈ

సృష్టియే అమాంతము లయించునని తలంచ వచ్చును. తలచి భీతిల్ల వచ్చును. ఎట్టి కారుమబ్బులు క్రమ్మిన కటికచీకటి మాపునైనను తళుకు మని మెఱుపులు తోచును సుమా! ఎంత నిరాశానిర్వేదాంధజీవనము నందైనను ఆశారేఖలు మెఱసి జీవిని పడనీయని ఆశపై యాశ తోచుచుండును సుమా!

వీరి అంతరంగము లెంత సంతాపమున కుమిలిన వైనను లోని దృఢభక్తి గాఢవిశ్వాసము చెక్కు చెదరలేదు. ఆ సర్వేశ్వరుని యందే వా రొక విధమయిన విరతి నా విషాదమధ్యమున గనిరి. హృదయా గాధతలములనుండి వెకలి వచ్చి ఏకాగ్రత మూర్తిగొన్న స్తోత్రములచే వారు పరమాత్మ గీర్తింప సాగిరి. సర్వశక్తిసంపన్ను డీశ్వరుడు తన సహజమాయావైఖరిచే ఆ హృదయములను అక్షరసహనశక్తినిభృత ములను గావించి కుసుమసుకుమారములయిన వారి శరీరములను తెప్పలను దుఃఖసాగరసంకులకల్లోలముల తాకిడికి పడకుండ జాగ్రత్తగ కాపాడెను.

విశ్వంభరయైన పృథ్వీమాత తన అమాయకులగు బిడ్డలకు దుర్భర కష్టములు కూర్చుచున్న కంసుని అధర్మమును దౌష్ట్యమును నిరంకుశత్వ మును చూచి సహించలేక పోయెను. ఆమె భగవానుని చెంత కరిగి వెల్లు విలపించెనని పురాణములు వాకొనుచున్నవి. సర్వేశ్వరు డామె ఆర్తితో కూడిన విజ్ఞాపనము లాలించి కరుణాపూర్ణుడై, జగత్పిత కావున 'తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్' అను ప్రతి జ్ఞను పాటించి భక్తజనుల యిక్కట్టు లణగద్రొక్కి కాచుట కిక నాల సించుట తగదని తలచెను. వసుంధరను వంతలనుండి రక్షించుటకును క్రూరుడైన కంసుని సంహరించుటకును పూర్వము నిగదితమైనట్లు దేవకియొక్క అష్టమగర్భమున కవతరించి ఆమె కుమారుడుగ భూలోకమున జన్మించుటకును కాలము పక్వమైనదని ఆయన తలచెను.

కంసుడు సైతము అతిశీఘ్రకాలములో రానున్న దేవకియొక్క అష్టమసంతానరూపమైన మహాపద నెదుర్కొనుటకు అప్రమత్తుడయియే యుండెను. ఈ లోకము లోకమే అత్యంతాతురముగ శిశుజననమునకు నిరీక్షించుచుండెను. దుర్మార్గులవలని భయ మిక తీరునని ఆసక్తితో సజ్జనులు వేచుచుండిరి. రేబవళ్ళు అమాయకులైన దౌర్భాగ్యదంపతులగు దేవకీవసుదేవుల కనిపెట్టి కాచియుండుటకు అసంఖ్యాకులు రాజభటులు నియుక్తులై అప్రమత్తులుగ నుండిరి. కంసుడు తనకు భీతిని గలిగించు ఆ శిశు వెప్పుడు పుట్టునా యని క్షణక్షణము కడు జాగరూకుడై తహతహతో తల్లడిల్లుచు త్రుటులు లెక్కించుకొను చుండెను. సర్వేశుడు ప్రభవించు సమయ మాసన్న మగుచున్నకొలది ఆ దివ్యదంపతుల హృదయములు గిలగిల కొట్టుకొనసాగెను. సహజవాత్సల్యప్రపూరము లయిన వారి మనోనేత్రములకు దుష్టసంహారక్రీడలు కనుపింపక పసిబిడ్డ భావి బాధలే పొడకట్టినవి. ఈశ్వరుని ప్రతిజ్ఞావాక్యము స్మృతిపథమున దోచి మధ్యమధ్య కొంత సాంత్వనము కలిగించుచున్నను మిక్కుటముగ దుర్భరదుఃఖదూషితములగు వారి జీవితములు క్రూరభీకరకంసకర్కశకార్యసంజాతస్మృతితోడనే ఘోషిల్లుచుండెను.

నిర్విరామమైన కంసుని అంతరంగముకూడ దాని భావనాశృంగము నందుకొనినది. ప్రతి త్రుటిలో నతడు శిశు జన్మమునే ప్రతీక్షించుచుండెను. కొన్ని వేళల నతడు భయావహుడై అతివిశ్వసనీయభటవర్గమునే నమ్మడు. కారుణ్యమునకు వశులై శిశుజననసందేశమును తన చెవికి జేర్చక గుప్త మొనర్చెదరేమో యని వాని యనుమానము. దానంజేసి, యతడు స్వయముగ కారాగారమునకు వచ్చును. ప్రతి యొకడును జాగ్రత్తతో నుండెనా లేదా యని పరిశీలించును. భయముచే వణకు న య్యభాగ్యదంపతులపై కోపేక్షణముల బరపి దూషించును. వెనుకటి కంటె నిక మిక్కిలి జాగరూకులై వర్తించవలయు నని భటాళి

నాజ్ఞాపించును. ముమ్మొదలు శిశువును తనకు చూపువానికి గొప్ప బహుమతి నిత్తునని ఆశలు పెట్టును. రేలు నిద్రించుటలే దతడు. చిన్న సవ్వడి యైనను ఉలికిపడి లేచి శిశువు నెత్తుకొని యెవ్వడో వచ్చుచున్నట్లు కంగారుతో పోయి. ఏమియు లేకున్కి వెను దిరిగి వచ్చును. మనసులో నే భావమో రేగిన దబదబ కిటికీయొద్దకు పరుగెత్తి చెఱసాల వైపునకు చూచును. శిశువు గదాచక్రములు తాల్చి తనను సంహరించుటకు వచ్చుచున్నట్లు రూపములు కంసున కెటు చూచినను దృగ్గోచరములు కాజొచ్చెను. ఈ భయంకరభావసందోహమునుండి తప్పుకొనుటకు కుసుమఫలసంభృతములయిన తరులతావళులచే నలరారు నుద్యానము వైపు చూచును. కాని ప్రతిలతనుండియు ప్రతితరువునుండియు గదాచక్రధారి పరుగెత్తుచు తన దెసకు వచ్చుచున్నట్లే తోచును. అటునుండి చల్లని శీతాంశుమండలమున్పై దృక్కుల బఱపును. కాని, క్రూరమైన చంద్రమండలముకూడ ఆ గదాచక్రధారినే తనపైకి పంపుచుండెను. అమృతకిరణములు విషమయము లగుచుండెను. ప్రకృతి మొత్తములో నే మూల చూచినను ఏ కోణ మీక్షించినను ఒక మహామాయ అతనితో శత్రుత్వమునకు పన్నిన పన్నుగడగా ఆ గదాచక్రధారియే కన్పట్ట సాగెను. ఈ బహిర్గోళమున శాంతి నొందక అంతర్గోళమును దర్శించుట కతడు కనులు మూయును. కాని. ఆ తిమిరములోనుండి ఆయుధధారియై శత్రు వుఱికి తనపై కెగిరి వచ్చుచునే యుండెను. నేత్రముల కున్మీలనము నిమీలనము రెండును భయదములే యగుచుండెను. అత డున్మత్తునివలె నయ్యెను. ప్రాణప్రియలైన మహిషీమణులే దరిజేర వెఱచుచుండిరి. అకారణకోపతాపోన్మాదభీభత్సమున నున్న అతని స్థితి జాలి గొలుపును. ఆంతరబాహిరముల నెల్లవేళల నతనికి గోచరించు నాయుధధారి భయద రూపము గాంచి యతడు వెఱగొందుచు వగగుందుచు మనస్సు నేకాగ్రముగ నట నిల్పుటంజేసి తల్లీను డయ్యెను. ఇట దేవకి కష్టపడుచుండెను.

ఎట్లుండెనని రాజభటులు లనుక్షణ మడుగజొచ్చిరి. ప్రభవించు బిడ్డను రక్షించుకొను నుపాయ మెఱుగని ఆ దంపతులు అసహాయులై ఆక్రందించుచు ఆశల బోనాడిరి.

అది వర్షాకాలము, అర్ధరాత్రి, తుపాను పెలె తోచెను. వానయు గాలి తోడై భీతి గొలుపు చుండెను. ఉఱుముల ఫెళఫెళార్భటులు మెఱుపుల తళత్తళలు కావలివారలకు దేవకీవసుదేవులకు భయము గొల్పెను. కొన్ని దినములనుండియు వారు కమ్మని నిద్ర నెఱుగరు. రాజభటులు నాటిరాత్రి నిద్ర రాకుండుటకు మిక్కుటముగ మద్యమును గ్రోలి వచ్చిరి. చల్లని ఈదరగాలికి మడుచుకొని సురామత్తతలో తమ విధిని మఱచి వారు నిద్ర కొరగిరి. ప్రసవవేళ సమీపించుచుండెను. దేవకి వసుదేవునితో గూడి తమ దురదృష్టమునకు విలపించుచు గుండెలు బాదుకొనుచు తల మోదుకొనుచు "బిడ్డా! నా కడుపున పుట్టకుము. పుట్టితివా ఆ నీచునిచే నేలకు కొట్ట బడుదువు. ఈశ్వరా! మా దెంత నికృష్ట జీవనము! పారము లేని ఈ దుర్భరదుఃఖసముద్రమున మునిగియున్న మమ్ముల నుద్ధరించుటకు నీ వేల రావు? మేము నీ దాసులము కామా? అనాథరక్షకా! రమ్ము. వచ్చి మమ్ము రక్షించుము. ఆలస్యము చేయకుము. మా దుఃఖము మితి మీరినది. మే మిక భరించలేము. రావా? ఇప్పటికైనను మా యందు జాలి కలుగలేదా?" అనుచు నిర్వేదమూర్ఛ నొందిరి. అ మ్మెమ్మెఱవు చీకటిలో ఒక వెలుగు భాసించెను. దానిముందు అనేకజన్మార్జిత దుఃఖాంధతమోమేఘపటలములు పింజలు పింజలుగ విచ్చి ఒరగి మాయమైనవి. సుఖసంతోషశాంతిభాస్కరబింబము షోడశవర్ష ప్రాయమైన శంఖచక్రగదాపద్మధరబాలకరూపమున వారి అంతర్గోళముల నెల్లెడల వెలిగించి తన మందహాసమున అమృతకిరణములు నింపి వారి నానందమున ముంచెను. క్షుధాశుష్కశరీరుడైన ధ్రువ ప్రాంతీయుడు తన హిమగృహమున బహుదినములు గడపి ఆహార

సంభార మైపోవ కుటుంబసమేతముగ కుమిలి కుమిలి దీర్ఘనిశాకాల మును వెడలబుచ్చి రానున్న దీర్ఘదినమున కెదురు చూచి చూచి ఆ సుప్రభాత మరుదేర సంతోషతరంగితుడై ఉప్పొంగుచు వెలికి గంతులిడి దూకుచు వెలుగును గాంచునట్లు, దేవకీవసుదేవుల హృదయము లా దివ్యసుందరవదనారవిందసందర్శనమున సంతసముతో పొంగినవి. ఆ బాలుడు పరుగెత్తుచు వారిచెంతకు వచ్చి "తల్లిదండ్రులారా! దుఃఖించకుడు. నే నింత కాలమునకు మిమ్ములను మీవంటి సజ్జనులను రక్షింప వచ్చితిని. పృథివి దుష్టభారమున నిక క్రుంగపనిలేదు. ఖలులకు రోజులు దగ్గఱ బడినవి. కంసుని తలపై కిరీట మిక నెక్కువ కాలము నిలువదు. నన్ను సంహరించుట కతనికి శక్తి చాలదు. నా శక్తియుక్తు లతని వాని కంటె బలవత్తరములయినవి. కనులు విప్పి మీ కుమారుడుగ నున్న నన్ను దిలకింపుడు. జనకా! గోకులమందు నీకు మిత్రుడైన నందు నొద్దకు నన్ను గొనిపొమ్ము. వాని భార్య యశోద ఇప్పుడే ఒక బాలికను గనినది. ఆ బాలను గ్రహించి నన్నామెచెంత విడిచి తిరిగి కారాగారమునకు రమ్ము. యశోద నిద్రించుచుండును. నీ త్రోవ కాటంకము లుండవు. పోయి రమ్ము." ఇట్లు వచించి ఆ మూర్తి అదృశ్యమైనది. తిరిగి తిమిరము క్రమ్మినది. అయినను దుఃఖభారము తగ్గినది. కన్నులు విప్పిరి. దివ్యతేజోవిరాజితుడు బాలకుడు వారికి నేత్రోత్సవము కూర్చెను. క్షణ కాలము సంతాపమును విస్మరించిరి. శిశురూపుడు అంగకముల గదలించుచు మందహాసము లొలికెను. మాతృదేవి ఆత్మజుని ముద్దుగొని ఆపదను మఱచెను. వెంటనే తమ స్థితిగతులను దంపతులు తలచిరి. వణకి పోయిరి. అంతఃప్రపంచరంగమున భాసించిన దివ్యబాలకుని మధుర సందేశములు తలపున మెఱసెను. తక్షణమే వసుదేవుడు పసివాని నెత్తుకొని నిలచెను. చరణశృంఖలముల విదలించెను. అవి జారి పడెను. కారాగృహద్వారములచెంత కరిగెను. అవి బంధింపబడి యుండెను.

త్రోసినాడు, సులువుగ తెఱచుకొనినవి. భటులు గాఢనిద్రలో నుండిరి. ద్వారమును దాటెను. అయిదు ద్వారములు దాటవలయును. ఎల్లెడ నిట్లే జరిగెను. భటు లెల్లరు నిద్రాపరవశులైరి. ద్వారము లన్నియు తాకుటయే తడవుగ తెఱచుకొని త్రోవ నిచ్చినవి. వసుదేవుడు విముక్తుడైనాడు. అతనిపై మహాకాశ ముండెను. స్వేచ్ఛావాయువు వానిపై వీచి చెఱసాల కూర్చిన దుర్గంధమును తుడిచివైచెను. జోరున వాన కురియు చుండెను. నల్లమబ్బులు చీకటిని మఱింత నలుపుచేసెను. తనపై గల ముఱికి గుడ్డలో నొక చెంగున పసిబిడ్డని జుట్టి ఎట్లో వానదెబ్బ తగులకుండ తిప్పలు పడుచుండెను. కాని తన గమ్యస్థానము నయ్యంధధ్వాంతనిశా మధ్యమున నెట్లు చేరుట? ఏమియు అగపడుట లేదు. తోచక నిలచి చింతసేయుచుండెను. ఒక విద్యుల్లేఖ మెఱసి జగము నంతటిని విస్పష్టముగ జూపినది. ఏదో ఒక త్రోవ కనబడినది. అతికష్టముగ దాని ననుసరించెను. అప్పుడప్పుడు మెఱయుచున్న మెఱపుల వెలుగున నత దేగు చుండెను. వాస యెంత తీవరముగ బడుచున్నను పిల్లవాడు తడియలేదు. అందులకు పరమేశునికి కృతజ్ఞత తెలుపుకొనెను.

చివురున కతడు యమునాతరంగిణి దరి జేరినాడు. ఒడ్డుల దన్ని ఘోరుకొల్పుచు సుడుల ద్రిప్పుచు నురుగుల గ్రక్కుచు పరువెత్తు నా నది లోని జలవాహమును జూచి అతని గుండె లవిసినవి. రక్తము చల్లబడి నట్లయ్యెను. దాటుట కొక పుట్టియైనను తీరప్రాంతమున లేకుండెను. ఆ వాహిని నెట్లు గడచుట? వాన గాలి చలి వీని బాధ లటుండ, కాల సర్పమువలె కదలిపోవుచున్న ఆ కల్లోలిని కడుంగడు భీతినే కొలిచెను. ఉపాయము తోచలేదు. నిరాశ అసహాయత అతని జడునిం జేసినవి. బుద్ధి స్తబ్దమై నిలచినది. అంతలో నొక జంబుకము నదిని దాటుట కుద్యమించుటను గాంచినాడు. ఈశ్వరప్రేషితముగా దానిని భావించి తా నా జంబుకమువెంట నీటిలో దిగెను. పోవుచుండగా ఆ నీరు మోకాలి

కంటె పైకి వచ్చుట లేదు. కాని చేతులలోని బిడ్డడు నీటిలో జారిపడినాడు. ఆతురతతో వంగి నీటిలో వెదకెను. లాభము లేకపోయినది. ఆశుగము వంటి ఆపగలో పడిన చేతనాచేతనములు ఒక చోట నిలచునా? ఎంత దూర మేగెనో శిశు వా పరుగెత్తు ప్రవాహమున బడి? "పరమేశ్వరా! దీనాతిదీనుడనైన నాకు మఱియు దీనతను గూర్తువా? నాతోనా ఎకసక్కెములు? ఇక శిశువు నా కెట్లు లభించును?" అని విషణ్ణతలో మునిగి నుదుటిపై గుండెలపై బాదుకొని నీటిలో దేవులాడుచుండు వేళ మోకాళ్ళ యొద్ద తేలిన శిశువు చేతులకు జిక్కెను. తీసికొని గుడ్డతో తుడిచి ముద్దిడుకొని జంబుకము తీయు త్రోవ వెంట నావలి గట్టు జేరెను. దేవదేవుని కీర్తించి టిప్పు టిప్పున గోకులమువైపు నడచెను. యాదవపతి నందుని గృహమున కేగుట కెంతో కాలము పట్టలేదు.

అతని కాశ్చర్యము గూర్చుచు నందుని గృహద్వారము తెఱచికొనియే స్వయముగ తనకు స్వాగత మిచ్చుచున్న ట్లుండెను. లోనికి ప్రవేశించి పరిచిత మగుటంజేసి యశోద వసించు నంతిపురి జేరి చెలికత్తెలతో నిద్రించు నాయమచెంత నున్న పసిబిడ్డను స్వీకరించి తన పుత్రు నట డించి శీఘ్రగతిని వీధిలోనికి వచ్చెను. అంతయు నొక్క త్రుటిలో జరిగినది. ఈ కృత్యములో నతని హృదయము తపించినది, దుఃఖించినది, కాని గత్యంతరము లేకపోయినది. యమునానదిని జేరినాడు. దానిని దాటుటకును, తిరిగి కారాగారము చేరుటకును అతడు పూర్వమంత బాధ పడలేదు. ఇచటి ద్వారములు తెఱచికొనియే యున్నవి. భటులు నిద్రించుచునే యుండిరి. ద్వారము లన్నియు దాటి విలపించుచున్న దేవకి చెంత జేరి బాలిక నిచ్చెను. తలుపులు వాని కవియే మూసికొని యథాపూర్వముగ బద్ధము లయ్యెను. ఆ బాలిక ఎంత సౌందర్యవతి! కారుమబ్బుల నడుమ దాగుడుమూత లాడునట్లు మెఱసిపోవు తటిల్లతలు ప్రకృతి నంతటిని. కాంతివిభ్రాజితము నొనర్చి ఉఱుములను పిడుగులను వానపోతలను

లెక్కింప కుండునట్లు బాలికామందహాసవిలాసలీలలు ఆ దుస్సహస్థితిని గాని రానున్న దుర్భరఘోరగతిని గాని గణింపక విరాజిల్లెను. ఇక నొక గంటకు తాను కంసునిచే నేలకు గొట్టబడును. కాని ఆ బాలిక మహానంద మున దేలుచుండెను.

ప్రాతఃకాలము సమీపించెను. కంసభటులు కోడికూత విని దిగ్గున లేచిరి. తమ విధుల మఱచి నిద్రించినందులకు భయపడిరి. ఆ దోషము మొక్కరిది కాదు. అంద ఱట్లే యగుటచే ధైర్యము నొంది కారాగారము వైపు పరుగెత్తి పసిబిడ్డను గాంచి తల్లిదండ్రులు గోలపెట్టి యేడ్చుచున్నను పాటించక లాగికొని వేవేగ కంసుని చెంత కేగి అర్పించిరి.

ఆడపిల్ల యగుటచే కంసుడు చికాకు నొంది స్వయముగ చెఱసాలం కరుగుదెంచి చూచెను. మగబిడ్డడు కలుగు ననుకొనిరి కావున; ఏమైనను మోసము జరిగెనేమో యని యాత డనుమానించి సర్వమును బరీక్షించి ఎల్లరను విచారించెను. అత డెంత యత్నించినను యథార్థముయొక్క వాసన అణుమాత్రమైనను బయల్పడలేదు. ఆడపిల్లకదా చంపవలదని వసుదేవుడు బ్రతిమాలినాడు. కాని అతడు మూఢముగ "నీచుడా ! నాపై కుయుక్తులు బన్న జూచితివా? ఛీః నా శత్రు వే రూపమైనను గ్రహించ గలడు. ప్రస్తుతము స్త్రీరూపము ధరించినంత మాత్రమున విడచువాడను కాను" అని పలుకుచు భటులతో గూడి వెడలిపోయెను. ఆ బాలిక నవ్వుచు సంతోషమున దేలియాడుట జూచి కంసుని భీతి పర్ధిల్లెను. అక్కడొక బండ కలదు. అతడు గట్టిగా శిశువు పాదములు పట్టుకొని బండపై కొట్టుట కొక్క ఊపున పైకెత్తెను. కాని చేతినుండి జారి ఆ బాల పైకెగసి పెద్ద రూపు దాల్చి వెనుకటికన్న ఇనుమిక్కిలిగ నవ్వుచు అష్ట బాహువులు ధరించి కంసునిజూచి అధిక్షేపముగ నిట్లనెను-"ఓరి మూర్ఖుడా! సర్వేశ్వరు నానతి నడ్డగింప దలచితివా? నిన్ను సంహరించువాడు గోకుల మున నందు నింట బెరుగుచున్నాడు." ఇట్లు పలికి అదృశ్య యయ్యెను.

కంసుడు గజగజ వణకిపోయెను. కొంతకాలము తెలివిమాలి జడుడై నిలుచుండెను. పిమ్మట వాని రాక్షసప్రవృత్తి చండక్రోధమును గ్రక్కినది. వెంటనే గోకులమున నందునింట పసిబిడ్డ డుండెనేమో చూచి రమ్మని గూఢచారుల బంపెను. పైకి గంభీరముగ నున్న అతనిలో మహాభయము నిండియుండెను. కఠినశిక్షను దేవకీవసుదేవులకు తొలగించి శృంఖలములు తీసివైచెను. ఎందులకై వారల బంధించెనో అయ్యది పరమేశ్వరునిచే భంగింపబడినది కావున వారికి వలయు వస్తుసామగ్రిని సమకూర్చి శిక్షను సడలించెను. భగవానుని జననముతో దేవకీవసుదేవుల యిక్కట్లు మూడుపాళ్ళు తొలగినవి. తమ పుత్రు డే నాటికైనను వచ్చి తమను బంధముక్తులను గావించునని వారు నిరీక్షామయజీవితములు గడపుచుండిరి. హృదయభారములు తగ్గినవి. భక్తిప్రపత్తులతో కాలము గడచుచుండెను.

ఉదయ మగుటతోడనే గోకులమునం దెల్లరు తమకు పతియైన నందునికి పుత్రోదయ మైనదని విని మితిలేని మోదమున నుబ్బ సాగిరి. తమ యేలిక నట్టి తటి కానుకలతో దర్శించుటకు బుజములపైనను తలల పైనను దధిక్షీరనవనీతభాండము లిడుకొని వచ్చిరి. నందు డగపడుట తోడనే వారి వినిర్మలహృదయములు పొంగుటచే ఆ ముంగిలి నెల్లరు గ్రామ్యనాట్యము లాడజొచ్చిరి. పైనున్న మృద్ఘటములు క్రిందబడి పగులు నన్న స్మృతియే వారికి లేకపోయెను. నేలబడిన భాండములలోని పెరుగు పాలు ఆ ప్రాంగణము నంతటిని బురద గావించెను. క్రొత్తగా వచ్చు వార్తా బురదలో జాఱిపడుచుండిరి. వారు తెచ్చిన ఘటములు సైత మొలుకుటచే మఱింత బురద యయ్యెను. పడిన వారిని లేవదీయుటకని పోయి కొందఱు బురద పూసి పెరుగు పులిమి వచ్చిరి. పడినవారు లేచి బాకీలు వడ్డితో తీర్చిరి. ఇ ట్లెల్లరు పెరుగు పాలు వెన్న బురద కలిసిన లేపనము నిండిన శరీరములతో గంతు లిడుచుండిరి. కొందఱు వంట

యింటి నుండి పసుపు తెచ్చి పాలలో పెరుగులో గలిపి అందఱపై గ్రుమ్మరించిరి. అందఱ శరీరములు వస్త్రములు పసుపు వన్నెతో ప్రాతఃకాలపు ఎండలో పైడి వెలుగుల గ్రక్కెను. తంబుఱలు చిఱుతలు గజ్జెలు మద్దెలలు వహించి నృత్యగానముల కొందఱు పరవశు లగుచుండిరి. వారి కీర్తన లంద ఱందుకొని ఒక మహాతన్మయస్థితిలో పారవశ్యమున పాడ దొడగిరి. అ ట్లెంతసేపు వా రుండిరో అంతసేపును వా రీ ప్రపంచబంధముల గడచి నట్లుండిరి. తుదకు యథాస్థితికి వచ్చి అలసి యమునచెంత కేగి స్నానము లాచరించి నందు నంతఃపురమున జరుగబోవు విం దారగింప నేగిరి. ఇదియే జన్మాష్టమి. ఆసేతుహిమాచలము భారతజాతి గోకులమున జరిగిన ఈ ఉత్సవమును ప్రతివత్సరమును జరుపుకొనును.

గూఢచారులవలన కంసుడు నందునకు పుత్రోదయ మైనదని విని ఆ బిడ్డనికి విషప్రయోగము జేయుట కొక రక్కసిని బంపెను. ఆమె ఒక సుందరయువతీరూపము దాల్చి కుచాగ్రముల విషము నింపుకొని గోకులము జేరెను. ఒక సంపన్నకుటుంబమునకు జెందిన ఉత్తమజాతి యువతిగా నామె నక్కడివారు తలచిరి. ఎకాయెకి నందు నంతఃపురము జొచ్చు నామె నెవ్వ రడ్డగించలేదు. లోపల ఒడిలో కుమారు నుంచుకొని కూర్చున్న యశోదచెంత కరిగి, అట్టి ముద్దుబిడ్డను గన్నందుల కామె నభినందించి, ఆమె ఇష్టపడినచో పిల్లవాని నొకసారి ఎత్తుకొని ముద్దుబెట్టుకొని తిరిగి యిచ్చెదనని అర్థించెను. మాయ నెఱుగని ఆ మాతృమూర్తి ప్రేమను వెలిబుచ్చుచున్న ఆ ప్రార్థనమును తిరస్కరింపజాలక బిడ్డ నందించుట తోడనే అ రక్కసి పలు తడవలు ముద్దాడుటయే గాక బాలకుని నోటిలోనికి తన కుచాగ్రములను క్రుక్కసాగెను. ఒక సామాన్య గోపికనుండి తన దుష్టభావమును దాచగలిగినను సర్వవ్యాపియైన సర్వజ్ఞుని మాయబుచ్చజాలదు గావున, పా లాను నెపమున ప్రాణములనే గ్రోలుట కుపక్రమించిన ఆ బాలకు నెత్తుకొని ఆమె వెలుపల కేగుచున్నను

యశోద విశ్వాసముతోడ ఊరకుండెను. పట్టిన పట్టు విడువని బాలకుని నుండి తప్పించుకొను నుపాయముం గానక సుందరయువతీరూప ముడిగి రక్కసి నిజరూపము దాల్చెను. వటవృక్షప్రమాణముగల ఆ భీకర దుస్సహవికారరూపిణి తన యసువుల గాపాడుకొనుటకు చేతగాక క్రిందబడి గిలగిల కొట్టుకొని పెల్లఱచి ఉసురుల వీడెను. దాని ఉలివునకు గోపగోపీసమూహము చేరినది. దాని పేరు పూతన. పిల్లవా డా కళేబరముపై నాడుకొనుచుండుటను వారు గాంచిరి. పుత్రునికై యశోద పరుగెత్తుచు వెఱ్ఱిదానివలె వచ్చుచుండెను. ఇంతలో నొక గోపాంగన వస చంత నున్న పిల్లవాని సందించి జరిగిన కథను వచించెను. ఈ బాలు డెంతవాడని అది విని వా రెల్లరు వింతపడిరి. విభ్రాంతి నొందిరి. ప్రశాంత జీవనము గడపు తమ గోకులమున నిట్టి విపరీతకృత్యము జరుగుట అందఱకు ఒక ఆవేదనమును ఒక అనుమానమును కలుగజేసెను. ఆ రక్కసి తప్పక కంసుని చేతనే పంపబడి యుండుననియు. తోబుట్టవు బిడ్డలనే సంహరించిన అత డెంత అకార్యమునైనను జేయగల సాహసముగల వాడనియు దూషించిరి. వసుదేవునితో నందుని కున్న స్నేహము ఈ కృత్యమునకు కారణమని వారు నిర్ణయించిరి. నాటినుంచి క్రొత్తవారికి గోకులమున ప్రవేశము దుర్లభమయ్యెను. కాని. రాక్షసుల మాయను వారు గుర్తింప జాలకుండిరి.

ఒకనాడు దధిక్షీరాదులు గల భాండములతో నొక శకటము నింపిరి. ఆ బండిక్రింద బాలకు డుండెను. ఒక రాక్షసు డా శకటము నాక్రమించి క్రింద నున్న బాలుని గూల్చు నుద్దేశమున దాని విఱుగజేసెను. కాని బాలునిపై నొక చెక్కగాని ఒక కుండగాని పడిన పాపమున బోలేదు. బాలు డా బండి నొక తన్ను దన్నెను. దానితో నా రాక్షసుడు నేల గూలి గతప్రాణు డయ్యెను. మఱియొక తూరి కుమారు నెత్తుకొని యశోద ముద్దాడుచుండ హఠాత్తుగ పిల్లవాడు బరువెక్కెను. మోయలేక క్రిందకు

దించినది. ఆ యదను గ్రహించి రాక్షసు డొకడు బాలు నెత్తుకొని పోయి ఏ కొండపైననో పడవేసి ప్రాణములు హరింపదలచి ఒక సుడిగాలి రూపున వచ్చి పిల్లవాని చుట్టును గ్రమ్మి లేవ నెత్త జూచెను. మొదట కొంచెము కష్టమయ్యెను గాని పిదప లేచెను. కొద్దిసేపటికి మఱల బాలుడు బరువయ్యెను. ఆ బరువును భరించలేక గాలిరూపున నున్న రాక్షసుడు నేల గూలెను. నిజరూపమున చచ్చి పడిన రక్కసుని కళేబరముపై క్రీడించు బాలుని జూచి గోకులవాసు లబ్బురపడిరి. వారు పిల్లవాని దీసికొనిపోయి పుత్రునికై విలపించుచు ఏమియు దోచక తిరుగుచున్న యశోద కిచ్చిరి. అప్పటున ఆనందము నొందని వారు లేరు. ఆ తల్లి వారెల్లరకు తన కృతజ్ఞతను వేనోళ్ల దెలుపుకొనెను. ఇట్టి కృత్యములు పెక్కు లొనర్చి తన నెదుర్కొన వచ్చిన రక్కసుల నెల్లరను గూల్చిన బాలకుని చేష్టలను పురాణములు విపులముగ వర్ణించినవి. ఇట్టి పనులచే బలసౌందర్యములను యశస్తేజములను వృద్ధిబొందించుకొనిన ఆ పుత్రకుని చరితము కడు వింతయైనది. కాని, కొందఱా రక్కసుల కృత్యములు హఠాత్సంభవములనియు, ఎట్లో పిల్లవా డా యాపదల దప్పించుకొనెననియు, ఇవి కవులచే గొప్పగ వర్ణింపబడి రాక్షస సంహారకథలుగ వర్ణింపబడినవనియు, నిర్లక్ష్యముగ బల్కుదురు. ఆధునిక ప్రకృతిశాస్త్రము వారి నట్టి విమర్శకులనుగ జేసినది. అది యిట్లు చెప్పును— "ఈ ప్రకృతిలో ఎనుబది పదార్థము లున్నవి. ఒక్కొక్క దాని కొక లక్షణము కలదు. ఆ లక్షణము లెప్పుడు నట్లే యుండును. అవి మారవు. ఇవి ప్రకృతి ధర్మము లనబడును" అని. ఇది నేర్చిన నాస్తికులు సంశయాత్ములు అజ్ఞతావాదులు ఈ ప్రకృతిని సృజించిన పరమాత్ము నంగీకరింపరు. ఆ ఎనుబది పదార్థములు వాని ధర్మములు అవియే సర్వకార్య కారణ సమన్వయమునకును సరిపోవునని వారి విశ్వాసము. ఈ విశ్వమును దీని కృత్యములను వారా జడప్రాకృతిక శక్తుల మేళనమున మాత్రమే

సంభవించు వానినిగ క్రిందకు పడలాగిరి. వీని నన్నింటి నొక కట్టడితో నడపించు చైతన్యము వీని వెనుక నొకటి లేదందురు. లక్ష్యశూన్యమైన భావశూన్యమైన ఈ సృష్టి వాహిని కార్యకారణతటముల నొఱయుచు దేశ కాల సైకతములపై అవ్యక్తమున జనించి అవ్యక్తమును జేరుచున్న దందురు. మఱి ఈ ఆత్మజ్ఞానము మానవుని ఈ చైతన్యము ఇవి యేమి ?

కొన్ని పదార్థములు కొన్ని ప్రమాణములలో మేళనము నొంది నపుడు కలుగు పరిణామములు. మరణము శరీరమును నిశ్శేషము చేయును. అంతతో సరి. ఇవి ఎంత హేతు పూర్వకముగ కన్పట్టినను అవాంఛనీయములు అజ్ఞాన జనితములు. ఆ పక్షమున, ఈ విశ్వ మొక యంత్రము. ఆత్మరహితమైన చలనవస్తువు. యంత్రమును నిర్మించిన వ్యక్తి తెలివిగలవా డొక డుండవలయునుగద ! యంత్రతుల్యముగ జెప్పు నీ విశ్వమునకును హేతుభూతమైన చైతన్యమూర్తి హేతువుగా నుండ వలయునుగద! సజీవమైన శరీరమున ప్రాణముయొక్క గమన నిర్గ మనములకు హేతువైన ఆత్మ ఉండవలయును గద! అటులనే ఈ జగ త్ప్రాణము యొక్క ఉనికికే హేతువుగ ఒక పరమాత్మ ఉండ వలదా ? ఇది మన సహేతుకమైన సత్యసంపన్నమైన విశ్వాసము. పురాతన కాల మున నిర్మలజీవితముల గడపిన వారికి గూడ నిట్టి విశ్వాసమే యుండెను. పరమాత్మ కలదని, దానినే దేవుడని వారనిరి. ఆ దేవుడు ప్రకృతి సౌందర్య మావిష్కృతి నొందిన ప్రతి పదార్థమునందును తొంగి చూచెను. సూర్యుడు, చంద్రుడు, మెఱుము, ఉఱుము, కొండలు, అగ్నులు, నిర్మల గంగాదినదులు, ఉన్నత వటాది వృక్షములు, రత్నసింహాసనమునందున్న రాజు, రాజును శాసించు మహర్షి, భంగములేని సచ్చిదానంద సామ్రా జ్యము నేలిన చక్రవర్తులు-ఇట్లే ఉత్కృష్టమైనది, ఉన్నతమైనది,ఉత్తమ మైనది, ఉజ్జ్వలమైనది ప్రతిదియు ఆ దేవుడు ప్రకృతి వెనుక నుండి తొంగి చూచు ద్వారమని వారి విశ్వాసము. సజీవుడైన మానవుని ప్రత్యంగములో

మానవుడు నిండి యున్నట్లు, ప్రకృతిలోని ప్రముఖమైన ప్రతి పదార్థము నందును పరతత్త్వము వారి నేత్రములకు పొడకట్టెను. అట్లగుటంజేసి వినిర్మలహృదయులు అమాయకులు అయిన నాటి ప్రజలు గోకులవాసులు మన కథానాయకుని శైశవమున జరిగిన విపరీత సంఘటనలను హఠాత్సంభవములనియు, అతడెట్లో వానిని తప్పించుకొనెననియు తలచక. ఏవో అసురశక్తులు పన్నిన క్రూరచేష్టలనియు వాని నతడతీత దైవిక శక్తిచే జయించెననియు భావించుట సహజము కాదా? నేటి విమర్శకాగ్రేసరులు నాటి పూర్వ ప్రజల అమాయిక విశ్వాసములకు జాలిపడవచ్చును. కాని, మనము నాటి నేటి వ్యష్టులను పోల్చి చూచినచో నేటి నాగర స్త్రీ పురుషులకు ప్రకృతి తత్త్వ పరిశీలనమున గలిగిన జ్ఞానమును అభివృద్ధిని గాంచి ఈర్ష్యాకలుషము కాలేము. మనలోని కావ్యసౌందర్యమును చంపివైచి మన హృదయములను జడమైన మృతమైన మౌఢ్యలోకమున కది త్రోయుచున్నది. దానిలోని మాధుర్యము క్షణికమైన ఇంద్రియచాపల్యము తప్ప వేఱేమియు లేదు. మన దేవుని మనసుండి తొలగింప యత్నించుటయే గాక, ప్రేమరాశి సర్వరక్షకుడు కరుణామయుడు సత్సంపన్నుడు జగత్పిత జగన్మాత జగన్నేత జగన్మిత్రము అయిన దేవుని మనకు శాశ్వతముగ లేకుండ చేసి మనలను మార్పులేని హృదయములేని ఆత్మలేని కర్మసూత్రముల కిరుణకు పాత్రులు కమ్మని పడ ద్రోయుచున్నది. ఆధునికమైన అభ్యుదయము నాగరికత ఇంతకంటె ఉత్తమ మెద్దియు నీయలేనిచో, మనము ఆనాటి అమాయకులు - ఎవరు ప్రేమరాశియైన కరుణాసాగరుని పితృవాత్సల్యమున సురక్షితులుగ భావించి సుఖించిరో - వారికంటె మిన్నగ మిక్కిలి సుఖముగ నున్నట్లు నిజముగ ఊహించగలమా? గర్వకారణము మన కేమి కలదు? మనలోకమును మనమే సృజించుకొందుము మను మాట నిజమగునేని సుఖలోకమున సుఖియు. దుఃఖలోకమున దుఃఖియు. తపోలోకమున తపస్వియు, నివసించు రీతి,

నిస్సంశయముగ నాటి పురాతన విమలభావు లా గోకులనివాసులు మిక్కిలి సుఖమయమైన సంతోషలోకమున నివసించిరి. వారిలోకము వారి నిర్మల దివ్యతేజోమయ హృదయములకు ప్రతిరూపము. మన బాలుని శైశవమందలి కృత్యములు విపరీతములు మానవాతీతము లగుటంజేసి గోకులవాసులు వానిని దేవునిగ భావించిరి. ఆ కృత్యము లనేకములు శ్రీ మద్భాగవతమున బహుదూరము కమనీయముగను రమణీయముగను వర్ణింపబడినవి. ఒకప్పు డతడు మన్ను తినినా డేమోయని యశోద వాని నోటిని పరీక్షించెను. ఆ నోటిలో బ్రహ్మాండ మంతయు ఆమెకు ప్రత్యక్ష మయ్యెను. మఱొక సారి చిలిపితనము పెల్లుగ జేయుచున్న పిల్ల వానిని బంధింప దలచి త్రాళ్లెన్ని తెచ్చియు చాలకుండెను. తుదకు తల్లిని విసి గింప దలచక తానామెకు వశుడై ఒక ఱోటికి కట్టబడెను. బంధించితిని కదా యని ఆమె లోనికి పనులు చూచుకొనుట కరిగెను. తల్లి తనను వీడి పోయిన పిదప బాలుడు ఱోటి నీడ్చుకొని పెరటిలోనికి జని రెండుచెట్ల మధ్యగా పోజూచెను. ఆ ఱోలు చెట్లమధ్య చిక్కుకొని రాకుండుటచే నత డొక్క లాగు లాగెను. ఆ దెబ్బను భరించలేక రెండు చెట్లును నేల గూలినవి. వానినుండి ఇరువురు గంధర్వు లుద్భవించి బాలుని దేవదేవునిగ కీర్తించిరి.

అతడు కొంచెము పెరిగి నడచుట, పరుగెత్తుట నేర్చిన పిదప, ఒకసారి పండ్లమ్ముట కొకతె వచ్చెను. బాలునికి పండ్లపై కోర్కె కలిగెను. ఇంటికేగి దోసిలితో గింజలు తెచ్చి పండ్లమ్ము నాపె యొద్దకు వచ్చెను. ఆమె పిల్లవాని వాంఛకు ముద్దుగొని ఒక్క పండునకైనను చాలని ఆ గింజ లందుకొని వాని దోసిలి నిండుగ మంచి పండ్లుంచి పంపెను. బాలుడు సంతోషాతిశయమున నవ్వుచు పండ్లతో పరుగెత్తెను. ఆమె పిమ్మట తట్టలోనికి చూచుకొనగా ఆ గింజలన్నియు బంగారు తునకలు రత్నాల రవ్వలుగా మాఱియుండెను. ఇట్టి కృత్యము లన్నియు

అతడు దేవాంశసంభూతుడను భావమును గోపకుల హృదయముల నాట జేసెను. వాని సహజమైన ప్రేమ బంధమున అతనిలోని అతి లోక భావమును వారు మఱచి పోయిరి. నిత్యము కంసునిచే పంపబడు రక్కసులవలన కలుగు యిక్కటులనుండి బాలకుని రక్షించుటకు వా రాలోచించిరి.



# బృందావనము

నందుడు అతని సోదరు డుపనందుడు గోపాలురతో మంతనములాడి గోకులమునుండి నివాసముల నెత్తివైచి యమునా తరంగిణి చెంత గల నందనోపమమైన బృందావనవీధి వసించుటకు నిశ్చయించిరి. మరు నాడు కుటుంబ సమేతముగ గోపకులు వస్తువాహనములు వెంట నిడుకొని దివ్యసుందర తరులతాశోభితయై పత్ర పుష్ప ఫల విరాజితయగు బృందాట వికి గోకులము వీడి వచ్చిరి. గోపకుల కది భూలోకస్వర్గము. నాటికి శ్రీకృష్ణు డయిదేండ్ల వాడు.

కొలది రోజులలో కళా కౌశలముతో నిర్మింపబడిన నూతనములైన గృహములతోడను, వీధులతోడను, దేవాలయములతోడను, గోశాలల తోడను, తీర్చి దిద్ది నట్లున్న నవ్యనగరము గోపాల గోపికా బృందముతో గూడి దివ్యశోభతో నుండెను. ఆ చెంత గోవర్ధనము పర్వతము కలదు. ఆ కొండ ఆ యేఱు ఆ వనము ఆ పురము అన్నియు ప్రకృతి తన శక్తి నంతటిని గూర్చి సర్వేశ్వరుని నివాసమునకై అమర్చిన సౌందర్య ధామముగ ప్రకాశించెను. నందుని గృహమున పెరుగుచున్న పరంధాముని గుర్తించి వాని ఆగమనమున కుప్పొంగి బృంద శకుంతారావముల, యమున తరంగధ్వానముల, మందవాయువు సుగంధవీచికల, లతా తరువులు పుష్ప ఫలముల స్వాగతము లాలపించి పూజించి నైవేద్యము లర్పించినవి. మిక్కిలి సుఖప్రదమును, ఎక్కువ సంతోషప్రదమును అగుటచే నాకలోకమున అమరుల భాతి బృందాలోకమున గోపకులు ఆనందమయజీవను లయిరి. ఎల్లరు శ్రీకృష్ణుడని పిలుచుచున్నను యశోదా నందులు పుత్రకుని గోపాలుడనియే పిలువసాగిరి.

బాల్యమున కృష్ణుడు మిక్కిలి చురుకుతనము కొంటెతనము కలవాడు. దేవుని కర్పించుట కిండ్లలో నుంచుకొనిన వెన్నముద్ద లపహరించి తానే ఆరగించెడివాడు. గోపయువతుల నేడ్పించుటయం దభిరుచి గొనెడివాడు. వా రెల్ల రొక గుంపుగ యశోదచెంతకు వచ్చి అతని చేష్టలను గూర్చి నేరములుగ చెప్పెడివారు. కాని, తల్లి కుమారుని దండింపబోవ వా రడ్డము వచ్చి వలదని వారించి అతని సౌందర్యమునకు ముగ్ధలై ముద్దుగొని పోయెడివారు. దేవకి సప్తమ గర్భము రోహిణి యందు సంక్రమించి, ఆకారణమున సంకర్షణుడను బాలు డుద్భవించెనని వింటిమి. ఇతడు కూడ దివ్యసౌందర్య శోభితుడై జనుల హృదయముల నభిరమింప జేయుటచే రాముడని పిలువబడు చుండెను. యశోదా సుతుడు శ్రీకృష్ణుడు అన్యులచెంత నెంత కొంటెగ వర్తించినను అన్నయైన రామునికి మిక్కిలి విధేయుడై యుండెను. రాముడు శరీరసౌష్ఠవమున గట్టివాడు, విశదహృదయుడు, నిర్భయుడు. ధీరుడు. కాని, కృష్ణుడు మాయావి బుద్ధిశాలి సుకుమారుడు. పైకి కోమలుడుగ కన్పట్టినను మనశ్శరీరముల నంత బలిష్ఠుడు లేడు. శ్రీకృష్ణునకు అగ్రజునిపై నున్న ప్రేమ గౌరవము ఈ భూలోకమున మ రెవ్వరిపైనను లేదు. ఈ బాలకు లిద్దఱు తమ యీడు గోపకుమారులగూడి చెంత గల బృందాటవి లోని పచ్చికబీళ్ళలో గోవుల మేపుటకు తోలుకొని పోయెడివారు. వారి దొక ఆనందరాజ్యము. ఆలమందలు మేయుచుండెడివి. వారు బహువిధ క్రీడల నాడుచు పాడుచు ప్రొద్దులు పుచ్చెడివారు. సాయంకాల మగుసరికి గోవుల మరలించుకొని వచ్చి గోశాలల దోలి తమకై భోజనములు సిద్ధముచేసి యెదురుత్రోవలు చూచు తల్లులపాలి కరిగి కడుపార భుజించి అడవిలోని తమ అనుభూతులను వర్ణించి చెప్పెడివారు. ఎప్పుడును ఏదో ఒక రాక్షసరూపము వచ్చుటయు, మోసమున రామకృష్ణుల జంప బోవుటయు, వారది యెఱింగి వాని సంహరించుటయు. అది కంసప్రేరిత

మగుటయు — ఇట్టి గాథలు తల్లులు విని భీతిల్లి యిక పిల్లలను ఆల గాయుటకు పంపరాదని అనుకొందురుగాని, మరల సూర్యోదయమై వెలుగు వచ్చి ప్రకృతి రమణీయ వేషధారిణియై ఆహ్వానించుచున్నట్లుండ వా రూరకుండలేక తల్లుల బ్రతిమాలి భంగపడి యీ ఒక్కరోజు పోయి వత్తుమని పయనమై పోవుదురు. మరల నేదో పూర్వమువలె సంభవించుటయు రామకృష్ణు లా యాపదను తప్పించుటయు సహజమయ్యెను. ఒక దురుద్దేశ్యముతో నిత్యము జరుగుచున్న ఈ పోరు హఠాత్సంభవ మనుటకు వీలులేదు. ప్రత్యేకముగ పనిపెట్టుకొని వారి ప్రాణములు దీయు సంకల్పమున వచ్చు నా విపత్పరంపరలో ఒక విధాన మున్నది. విమర్శకులు పూర్వగ్రంథముల నవలోడన మొనర్చి విపరీతార్థములు కల్పించి ప్రత్యక్షముగ గన్పట్టు స్పష్టార్థమును త్రోసిపుచ్చ జూతురు. వారు కల్పించు అర్థములందైనను ఒక సమన్వయము కుదురుట లేదు. ఇక తోచక మధ్య నున్న అంశములు ప్రక్షిప్తము లనియు, అవి యిటీవలి వారు చొప్పించి రనియు, యిచ్చ వచ్చినట్లు బాధ్యతారహితముగ బల్కుదురు. పామరజనునికైనను సంతృప్తి గూర్చని వారి ఊహాగానమును స్మరింప బనిలేదు. నేటి మనదృష్టి కసాధ్యము లనిపించు కృత్యములుగ దోచినను, షేక్స్పియర్ తన నాటకమున హామ్లెట్ నోట బలికించిన వాక్యము లాలించిన చాలును— "ఓయి హొరేషియో ! మీ తత్త్వశాస్త్రములు కలనైనను గాంచని చిత్రములు భూమియందును స్వర్గమందును పెక్కులు కలవు". గ్రుడ్డిగ దేనిని విశ్వసించరా దనుట నిజమే. కాని ఏ పురాణములనుండి మాత్రమే మనకు విషయములు లభించుచున్నవో ఆ పురాణవాక్యము లబద్ధములని నమ్ముటకును నమ్మించుటకును తగినంత ప్రబలప్రమాణములు దొరకువఱకు వీనిని కాదనుట తగదు. అసాధ్యము లనుకొనినవి శాస్త్రవిజ్ఞానమున నేడు సాధ్యములుగ రుజువైనవి. నేడసాధ్యము లనుకొనినవి రేపు సాధ్యములని మరల స్పష్టము కాకూడదా?

కావున అసాధ్యములను మార్గమును వదలి శ్రీమద్భాగవతమునందును ఇతర పురాణములందును చక్కగ వర్ణింపబడిన శ్రీకృష్ణుని కథాంశము లను నవ్యదృష్టితో పరిశీలింతము. దిగ్దంతులైన పాశ్చాత్య పండితులు సైతము కీర్తించుచున్న పురాతన ఋషిసత్తముల వాక్యజాలమును, వ్యర్థ విమర్శకుల త్రోసివేతను గమనింపక, సత్కరించుట వలననే వారి ఋణమునుండి విముక్తుల మగుదుము. ఇప్పట్టున నీ క్రింది సామెత స్మరింపవగును. 'అమరేంద్రు డడుగిడ జంకుచోట అవివేకి గబగబ త్రొక్కిపోవును'.

అప్రాకృతికమైన శ్రీకృష్ణుని జన్మవృత్తాంతము పరీక్షించితిమేని, నాటి దుర్జనుల దుష్టకృత్యములవలన సజ్జనులు పడిన బాధలు సమీక్షించితి మేని, జననమైనది మొదలు వానికి అడుగడుగునను తటస్థించిన విపరీత మైన ఆపత్పరంపరల నవలోకించితిమేని, నయ విదూరులై నాస్తిక భావమున మెలగు ఆప్రజల చిత్తవృత్తుల గమనించితిమేని, ప్రపంచము యొక్క గతచరిత్ర నాలోకించితిమేని, ఎప్పు డెచ్చోట నిరంకుశత్వము నీతిశూన్యత నాస్తికత ప్రబలి ప్రజలు తపింతురో దానిని శాశ్వతముగ సాగనీయక ఒక తారకు డవతరించి తప్పక వారి నుద్ధరించుటను గ్రహిం చితి మేని, తన బిడ్డల యోగక్షేమము లారయుచుండు పరంధామునిచే దైన్యదుఃఖితులైన వారి గాచుటకు పంపబడిన ప్రతినిధిగా శ్రీకృష్ణుని మన మంగీకరించి తీరుదుము. దైవశక్తి వానిద్వారమున బహిర్గత మగుటచే వాని కృత్యములు లోకాతీతములు కాక తప్పవు. సామాన్యులు తమ అల్పజ్ఞానముచే వాని నర్థముచేసికొన యత్నించుట వ్యర్థము. ఒక మహాత్ముని గ్రహించ వలయునన్న మనముకూడ మహాత్ములము కావలయును. ఒక ప్రాంశువృక్షమందున్న ఫలము నందుకొనవలయునన్న మన మా పరిమితికి లేవవలయును ; లేదా మన సాధనమైనను ఆస్థితి నందుకొనవలయును. మన విమర్శకులు శ్రీకృష్ణు నర్థము చేసికొనుటకు

ఆ అనంతశక్తిలోని లేశమునైనను నింపుకొని యుండవలయును. వానికి హృషీకేశుడను నామము కలదు. ఇంద్రియములు శాసించువాడని యర్థము. వాని నీక్షించుటకు ఇంద్రియముల నతిక్రమించి చూడవలయును. విషయముల నన్నింటిని నిరోధించినగాని ఆతని జీవితములోని లోకాతీత కృత్యముల కర్థము లభించదు. వాంఛలు కామితములు అంధత్వమును గూర్చుచుండ, నిష్కామయోగి హృదయము గ్రుడ్డివానికి గుడిలోని దివ్యసుందర విగ్రహము కనబడని రీతి అపగతము కాదు. శ్రీకృష్ణుని సంహరించుటకు కంసునిచే పంపబడి అనేకులు రక్కసులు వచ్చిరి. కాని.వారెల్లరు వేయిమడుంగులు వానికంటె బలవంతులైనను వానిచేత నిహతులైరి. ఒక పురుషునకు గాని ఒక స్త్రీకి గాని మనసుయొక్క ఏకాగ్రత ఎట్టి మహత్తరశక్తి నిచ్చునో భగవానుడైన పతంజలి తన యోగసూత్రము లందు జెప్పియున్నాడు. చెదరిన కిరణములందువలె చెదరిన గాలియందును బల ముండదు. కాని, ఒక అద్దపు ముక్కలో కేంద్రీకృతమైన ఆ కిరణమే అగ్నిశక్తి నొంది కాల్చును. అటులనే వ్యక్తిలో కేంద్రీకరింపబడిన మనస్సు అజ్ఞానతమస్సును కాల్చి సర్వమును చూచు శక్తి నిచ్చును. ఏకాగ్రత మనస్సునకు శక్తినిచ్చుటయేగాక శారీరక శక్తినిగూడ సమకూర్చగలదు. 'బలేషు హస్తిబలాదిని' అను సూత్ర మిదే, యర్థమును జెప్పును. మనస్సు హస్తిబలముపై కేంద్రీకరింపబడి నపుడు అది మన కగపడకయే ఆ శక్తిని పొందును. ఆ కేంద్రీకరణము పూర్ణమైనచో హస్తిబలమంత బలము సిద్ధించును. అటులనే సింహము వాయువు మొదలగు శక్తిగలవానిపై మనస్సు కేంద్రీకరింపబడెనేని తదనురూపమైన బలము ప్రాప్తమగును. అట్టి ఏకాగ్రతాసాధనము కలిగి ఇంద్రియములకు దాసుడు కాక తన వ్యక్తిత్వమును నిలుపుకొని హృషీకేశుడై తనకు తాను శాసకు డగునేని ఆ పరమయోగికి మనశ్శరీరశక్తులు స్వాధీనము లగుటలో సందేహము కలదా? కంస ప్రయుక్తులైన

రక్కసులచే డీకొనబడుటయేకాక అప్రాకృతిక శక్తులచేతను ఎదుర్కొన బడి అతని దివ్యత్వము పరీక్షింపబడినది. ఒకప్పుడు బృందాటవీశాద్వల ముల గోబృందముల సవయస్కులగు గోపకులతోగూడి కాయుచుండెను. ఒక రాక్షసుడు సర్పరూపముదాల్చి వారి నందఱ నొక్కుమ్మడి దిగ మ్రింగెను. అనశ్వరు డా కృష్ణ డొక్క పెట్టున దాని రెండు దవడలను రెండు చేతులతో బట్టి చీల్చి ఆ సర్పమును చంపి దాని గర్భమున అచేతనులై పడియున్న వారి నెల్లరను సచేతనుల గావించెను. అది అతని శక్తికి మించినది కాదు. ఎందుకన, అతఁడాజన్మయోగి; భూతములను శాసించగల సత్త్వ మాతని కున్నది. అందుచే విషము నమృతముగ మార్చగలడు. యోగియొక్క ఈ శక్తి 'యత్రకామ వశిత్వము' అన బడును. తా నేదికోరిన దానిని సిద్ధించుకొనజేయుట-ఇంద్రియభోగములపై విజయము సాధించుట కిదియే కారణము. సృష్టికర్తయగు బ్రహ్మ దూరమున నుండి దీనినెల్ల లక్షించుచుండియు మరల తా నొకమాఱు శ్రీకృష్ణుని దివ్యసత్తను పరీక్షింప దలచెను. ఒకనాడు గోపబాలకులు, గోవు లిచ్చవచ్చినట్లు బీళ్ళలో మేయుచున్నవేళ, చెట్ల కొమ్మలకు తా మంతకు మున్ను కట్టుకొనిన అన్నపు మూటలను విప్పుకొని యమునా నది దరి కరిగి చల్ది లారగించి వచ్చి చూడగా గోవులు కానరాలేదు. వా రేడువసాగిరి. శ్రీకృష్ణు డావుల వెదకబోయెను. బ్రహ్మ ఆ యదనున గొల్లపిల్లల నపహరించి గోవులతోగూడ కలిపి ఒక పర్వతగుహలో దాచి నిద్రింపజేసి గుహను మూసివేసెను. దిక్కులన్నియు మూలమూలల గాలించి గోవుల గానక చెలికాండ్రు సయితము కనబడకుండుటచే శ్రీకృష్ణుడు తన మనసు నేకాగ్రముచేసి చూడగా నది బ్రహ్మకృతమైన దుష్కార్యముగా నెఱింగెను. అంత నాపంతయు వంతనొందక వెంటనే తన మనశ్శక్తివలన గోవులను గోపబాలకులను సృజించి ఎప్పటి వేళకు గృహోన్ముఖు డయ్యెను. ఆయన మనస్సృష్టి వలన కలిగిన

గోపకుమారులను తమ బిడ్డలట్లే తల్లిదండ్రులు ప్రేమించిరి. వా రేమియు నెఱుగరు. వారిలో నే మార్పును కలుగలేదు. మీదుమిక్కిలి బిడ్డలపై వారి ప్రేమ పెల్లుబికెను. దానికి కారణము వా రెఱుగరు. ఆ బిడ్డల దర్శించినంతనే వారిలో నొక మహానందము ఉద్భూత మగుచుండెను. అట్టి యానందము ఆత్మవైభవ మెఱింగిన యోగులకు గాని లభింపదు. గోపికలందు ఉద్భూతమైన ఆ ప్రేమ ఆ యానందము శ్రీకృష్ణుడు సర్వప్రాణులందును వసించు పరమాత్మ స్వరూపు డని బోధించును. ఒకరియందు కలుగు ప్రేమకు కారణమేమి? మన బిడ్డలయందు మనకు ప్రేమ కలుగుటకు హేతువేమి? సర్వగతమైన పరమాత్మయే ఇందులకు కారణము. 'నాది - నేను' అనుకొనుట అజ్ఞానమువలన.

'నీది—నీవు' అని పరమేశ్వరుని గ్రహించి మనము అనగలిగిన నాడు మన ప్రేమను మనము గ్రహించితి మని అర్థము. శ్రీకృష్ణునం దట్టి ప్రేమలో నున్న మాధుర్యమేమి? అందఱియం దున్న పరమాత్మ రూపు డాత డగుటయే. అనగా దేవుడే అత డగుట. ఇట్టి గోవులు గోపకుమారులు శ్రీ కృష్ణుని వెంట నడయాడుచుండ ఒక సంవత్సరము గడచినది. కృష్ణుని ఈ మహత్త్వమును ఇట్టివే మఱి కొన్నిటిని బ్రహ్మ గ్రహించి విస్తుపోయెను. సృష్టికర్త తాను. సృష్టికార్య కలాపమున అతడు తనకంటె మిన్నయని తెలిసెను. బయటపడి శ్రీకృష్ణుని జేరి నమస్కరించెను. కృష్ణుని సర్వేశ్వరునిగా నెఱుంగకుండి నందులకు క్షమాపణము వేడెను. మనము కూడ ఆ బ్రహ్మవలె శ్రీ కృష్ణుని ఈశ్వర స్వరూపునిగా గ్రహింప జాలితిమేని, అట్లు గోగోప కుమారులను తన మనస్సునుండి సృజించి నా డనుటయందు శంకించము. కాని సంశయా త్మక మయిన ఇక్కాలమున అట్టి విశ్వాసము కలుగుట కష్టము. మాట లెక్కువగా క్రియ తక్కువగా వర్తించుచు విద్యావంతుల మనుకొను

యువకులకు విశ్వాసము కలుగుట మిగుల కష్టము. అందువలన పై విధమయిన సృష్టి ఒక పరమయోగి పట్టున సాధ్యమో అసాధ్యమో పురాతత్త్వశాస్త్రజ్ఞుల అభిప్రాయముల జూతము. పూర్వులయిన ఋషులు, తత్త్వవేత్తలు, భగవానుడైన పతంజలి స్వానుభవములను పాతంజల దర్శనమున బయల్పఱచినా డనుటను శంకించలేదు. వారి కంటె మనము వేత్తలము కాము. అనేకులు పాశ్చాత్య తత్త్వశాస్త్ర ప్రచండులు కూడ అంగీకరించిరి. మనము సందేహము బూనుటకు కారణము లేదు. పురాతత్త్వ వేత్తలు ఆస్తికులు నాస్తికులు పతంజలిని సమ్మతించిరి. కాన. ఆయన వాక్యము అందఱ వాక్యములకు సూత్రము. యోగతత్త్వమును పూర్ణముగ గ్రహించుటకు కొంత యోగాభ్యాసమున ప్రవేశ ముండవలయును. ఈ భూమండల స్వరూప స్థితుల పరిజ్ఞానము లేని పల్లీయు నొకని సముద్ర మెఱుగని వాని నడినేలనుంచి రైలుపై గొనివచ్చి సముద్రతీర నగరమునం దొక గదిలో నుంచి, 'సర్వము జలమయమైన ఒక మహాసాగరము నీ చెంత చేరువలో కొలది యడుగుల దూరమున నున్నది' అనుము. నాలుగు గోడలచే అరికట్టబడిన దృష్టిగల అతడు నీ వాక్యమును తిరస్కరించుట సహజము. కాని, వానినే వెలికి దెచ్చి ముఖాముఖి మహాసాగరమును జూపుము. అతడు తన అజ్ఞానమును సమ్మతించును. కేవల వాగ్వాదములందే ఇట్టి శంకలు సహజమైయుండ వ్యర్థవాదముల సంశయములు పెంచుకొని అభ్యాస శూన్యులైన వారి యెడ నది ఏంత యగునా?

భగవానుడు పతంజలి అనిన మాట లివి-'నివురు గప్పిన నిప్పును మన నోటితో ఊదితిమేని అనేకములు నిప్పురవ్వలు బయలుదేరును. అటులనే ఒక యోగి ఆత్మాహంకారమును ప్రబలవాంఛోచ్ఛ్వాసమున గట్టిగ ఊదునేని ఆ అహంతనుండి అనేకములగు చిత్తము లుత్పత్తిల్లును. యోగి ఈ శక్తిని సాధించుకొని ఒకదానిచెంత నొకటిగ అనేకభోగముల

ననుభవించ దలచినచో తన నుండియే అనేకవ్యక్తులను సృజించి వివిధ భోగానుభవము లందును. అట్టి వ్యక్తు లతనికంటె వేఱుకాక పూర్ణముగ అతనిపైననే ఆధారపడి యుందురు.' ఈ భావమును దెలుపు సూత్రము లివి - 'నిర్మన చిత్తాఅస్మితా మాత్రా తే. ప్రవృత్తిభేదే ప్రయోజకమ్, చిత్త మేక మనేకేషామ్' (అహంకారము నుండి నూతన చిత్తములు సృజింప బడును. అవి అనేకము లయినను వాని ప్రవృత్తులు వేఱయి నను అవి అన్నియు యోగి చిత్తమునకు పూర్ణముగ విధేయములు).

శ్రీకృష్ణుడు తననుండియే గోగోపకుమారుల నెట్లు సృజించి నదియు మన మిప్పుడించుక గ్రహించ గలము. ఇదంతయు బ్రహ్మ గమనించి గోపాల రూపధారిని పూజించి వాని చెలికాండ్రను గోవులను నిద్రనుండి మేల్కొల్పి తెచ్చి యిచ్చి తదాజ్ఞానుసారము నిజావాసమున కరిగెను. వాని మనస్సుచే సృజింపబడిన గోగోపకు లీ లోపుగ నతని యందే లీనత నందిరి. ఆ చెలికాండ్ర తల్లిదండ్రు లీ విషయమున సుంతయేని యెఱుగరు.

ఈ వృత్తాంతము జరిగిన స్వల్పకాలమునకే బృందావనమునకు సమీపమున నున్న తాళవనము నందలి మధురఫలములను ఎవ్వరిని తిననీయక అడ్డగించుచున్న ధేనుకాసురుడను రాక్షసుని శ్రీకృష్ణుడు సంహరించెను.

వేఱొకసారి శ్రీకృష్ణుడు స్నేహితులతో గూడి ఆల గాయుచుండ సూర్యతాపమునకు దప్పిగొని వారెల్లరు చేరువనున్న యమునాతరంగిణికి నీరు త్రావబోయిరి. త్రావుటయే తడవుగ మూర్ఛావశులై స్మృతి దప్పి పడిరి. కారణ మేమన, నదిలోని ఆ మడుగున కాళియుడను సర్పరాజు సకుటుంబముగ వసించుచు అచటి జలములను విషపూరితములు చేసెను. వాని మూలమున దానికి 'కాళింగమడుగు' అను పేరు కలిగెను.

శ్రీకృష్ణుడు తన మహత్త్వముచే వారలకు చైతన్యము కూర్చెను. పిదప మడుగున దూకి సర్పరాజుతో పోరి పాదాక్రాంతునిగా జేయ నాతడు కృష్ణ నానతిప్రకారము కుటుంబమును వెంటగొని అచ్చోటు వీడి పోయెను. ఇంకొకప్పుడు అరణ్యమున అగ్ని విజృంభించి గోగోపకుల చుట్టును మండుచు వారిని దహింపనున్న దాని నార్పి వారల రక్షించెను.

కృష్ణునకు తొమ్మిది పది సంవత్సరముల వయసు వచ్చినది. ప్రతి సంవత్సరము గొల్లలు దేవరలకు పతియైన శచీపతికి ఉత్సవము జరిపెడి వారు. ఆ వేళ వచ్చెను. గొల్లలందఱు ఉత్సవములు జరుపుటకు పెద్ద సన్నాహములు చేయ బట్టిరి. శ్రీకృష్ణుడు నందునితో ఈ ఉత్సవమును గూర్చి వాదించెను. సమస్తజగముల శాసించు సర్వవ్యాపియైన పరమేశ్వరు డొక డుండ వానిని విడిచి ఈ చిల్లర దేవులకు ఉత్సవములు చేయుట వ్యర్థమనియు, ఉత్సవము జంభారికి చేయుటకంటె అనుదినము పశువులకు గ్రాసము నిచ్చుచు తమ పల్లెకు తుపానుదెబ్బలు తగులకుండ కాపాడు చుండు గోవర్ధనగిరికి చేయుట మేలనియు పలికెను. వాని యభిప్రాయము నందుడు మన్నించెను. గోపకులు ఆమోదించిరి. ఇంద్రోత్సవ మాగి పోయెను. ఆ సంభారము గోవర్ధనగిరికి తరలించి మహావైభవముగ పర్వతోత్సవము చేసిరి. ఇంద్రునకు క్రోధము హెచ్చినది. తీవ్రవర్షా ఘాతముచే తుపానుదెబ్బలచే నతడు గొల్లలను బృందను సర్వనాశనము చేయ దలచెను. వర్షము లారంభమైనవి. విజృంభణము పొడ సూపినది. గోపకులు ప్రాణములు దక్క నుపాయ మెట్లని తల్లడిల్లిరి. కృష్ణు డిది యంతయు చూచెను. ఇంద్రుని అకృత్యమును గ్రహించెను. వానికి బుద్ధి చెప్పదలచెను. వెంటనే గోవర్ధనపర్వతమును పైకెత్తి ఎడమచేతి చిటికెనవ్రేలిపై నిల్పి గోపీగోపకుల నెల్లరను దానిక్రిందికి రమ్మనెను. అదే స్థితిలో వారము దినములు నిలుచుండి బంధుమిత్ర పశుపరివార సంభార మంతటిని ప్రళయ సన్నిభమగు అమ్మహావర్ష వ్యాఘాతమునుండి

తప్పించెను. ఇంద్రుడు గోపబాలరూపధారియైన కృష్ణుని అతిమానుష శక్తికి విభ్రాంతి నొంది వర్షమాపి వాని దరిజేరి, "నే నొక బహిః ప్రకృతిని మాత్రమే జయించితిని. నీ వంతర్బహిఃప్రకృతుల రెంటిని జయించిన విజేతవు. నీ శక్తి నెఱుంగక అజ్ఞానముచే నా చేసిన అకృత్యమును మన్నింపవే!" అని పాదాభివందనము చేసెను.

ఇహలోకమున మానవుని మనస్సు నాకర్షించునది సౌందర్య మొక్కటియే. సౌందర్యమనగా రూపసౌందర్య మొక్కటియే యని ఇచట తలచరాదు. షడింద్రియముల చేతను సౌందర్యము గ్రహించబడి ఆస్వాదింపబడును. కన్నులు రూప సౌందర్యమును గ్రహించును; వీనులు మధురపద గానాదులందలి ధ్వని సౌందర్యమును, నాలుక రుచి సౌందర్యమును, నాసిక పుష్ప పరిమళాదిగంధ సౌందర్యమును, త్వక్కు మిత్ర పరిష్వంగ మలయా నిలాది స్పర్శసౌందర్యమును, మనస్సు ప్రబంధ మాధుర్యాది భావ సౌందర్యమును — ఇట్లు వీనిలో ఏ ఒక్కటి యైనను సహృదయ లోకము నాకర్షించు పూర్ణప్రజ్ఞ గలది. గ్లాడ్‌స్టన్ మీ చేత చూడబడలేదు, కాని మీ రతని విశాలోదార భావపూరములయిన రచనలు చదివి వానిని ప్రేమింతురు. కావున పై ఆఱు విధములయిన సౌందర్యములలో ఏ ఒక్కదానిని మానవుడు కలిగి యున్నను మానవలోకము నంతటిని ఆకర్షించ గలడు. సుందర రూపుడు, మధుర గాయకుడు, సమ్యక్పాచకుడు, సుగంధకారుడు, సుఖభోగ ప్రదములగు వస్తువుల నిర్మించువాడు, ప్రాణ మానములు కాపాడు ధీరబలుడు, మనను చక్కగ పాలించు భూపాలుడు, మంచి కవి, చమత్కారి, హాస్యభాషి, వీరందఱు సృష్టి అయినది మొదలు ప్రజల నాకర్షించి వారిచే ప్రేమింపబడుచున్న వారే. సకల మానవులను ఆకర్షించి వారిచే స్తుతింపబడుటకును వారిచే ప్రేమింపబడుటకును ఒక్క సౌందర్యమే సమర్ధమైనచో, ఈ సౌందర్యము లన్నింటిని కలిగియున్నవాడు జగత్తంతటిచే ప్రేమింపబడుటయు

స్తుతింపబడుటయు దేవుడుగా భావింపబడుటయు అసహజమా? శ్రీకృష్ణ భగవాను డట్టివాడు. అత డతిలోకసుందరరూపుడు, అత్యంతమధుర గాయకుడు, అతిమానుషమహాబలసంపన్నుడు, మహోన్నతభావగీతా ప్రణేత, సకలభోగప్రదాత. మనపురాణములు మన చరిత్రాత్మకమగు మహాభారతము అత డిట్టి సర్వలక్షణసంపన్నుడని విశదము చేయు చున్నవి. ఎవరో కొందఱు తమలో కాక మఱొక్కచో సౌందర్య సందర్శనము చేసికొనుటకు కన్నులులేని దురహంకారగర్వదూషితు లైన పాపిష్ఠులచే తప్ప, ఆ కాలమందలి సమస్తప్రజానీకముచే అతడు మిక్కుటముగ ప్రేమింప బడినాడు, ఎక్కువగ స్తుతింపబడినాడు. తన ఇంద్రియములను జయించినవా డగుటచే సర్వసంగత్యాగులయిన మహర్షుల హృదయముల నాకర్షించెను. కావుననే వా రతని హృషీకేశు డనిరి. తల్లిదండ్రులకు విధేయుడై వారి యాజ్ఞల శిరసావహించి వర్తించుటచేతను తన మధురస్వరూప మధురభాషణ మధురచేష్టల చేతను వారి ప్రేమను సహస్రవిధముల చూఱగొనెను. మిత్రులను ఆప దలనుండి రక్షించుటచేతను గాఢముగ ప్రేమించుటచేతను వారి అంత రముల నాకట్టెను. అసమానసుందరరూపవిలాసములచే గొల్ల పడు చుల యెడదల దొంగిలించెను. సర్వరక్షకశక్తివలన ఎల్లరచే ప్రస్తు తింపబడెను. అందుమూలమున శైశవమునందలి వింతపనుల స్మరించ కయే వాని నవతారపురుషు డనుట తగును. నేటికిని, దేవునిలో ఒక అంశను మాత్రమే పొందినవాడని గాని, దేవుని చేరుట కొక సాధనరూపు డనిగాని, భావించక, దేవుడనియే వానిని భావించుచున్నారు. ఇ దెట్లు సంభవము? వీరి త్రోవ తప్పు కాదా? శ్రీకృష్ణు డొక్కడే దేవు డనదగునా? విచారించవలసియున్నది.

రూపముతో గూడిన దేవునియందు విశ్వాస మున్నవారు మెదడు లేని మొద్దులని భావించువారు చాలమంది కలరు. నిరాకారుడైన దేవుని

ఒక మానవాకారమున నిబంధించుట మహాసముద్రజలమును ఒక తులము నీరు పట్టు సీసాలో బిగించుటవంటిది. విశ్వవ్యాపియైన దేవుడు రూపరహితుడని పలుకుచు తాము ఏకము నిరాకారము అక్షరము సర్వ వ్యాపకము అయిన పరమాత్మయందే విశ్వాస ముంచుకొనిన వారమని సగర్వముగ సాకారుని గొల్చువారల నీసడించెదరు. వారి యీ విశ్వాసము వారి యనుభవముతో సమన్వయపడుచున్నదేమో పరిశీలింతము. దేవుడనగా ప్రతివానికి ఏమి అర్థమగుచున్నది? అత డీ విశ్వమునకు సృష్టిస్థితిలయకారణుడు. రాజులకు రాజు, సార్వభౌములకు సార్వభౌముడు, సర్వశక్తిమంతుడు, సకలకరుణాపూర్ణుడు, సర్వజ్ఞుడు, సౌందర్యఖని, ఈ సమస్తమునకు పిత. దేవుడనిన జగత్తులోని భావ మిది. తన గదిలో తా నొంటరిగ కూర్చున్న మానవుడు తనకు తోచిన దేది కాని, ప్రతిది కాని, చేయగలడు. దోషముల గణించు విమర్శకు లెవ్వరును లేరు. కావున నేను స్వతంత్రుడనని అత డనుకొనును. కొంతసేపటికి సేవకుడు వచ్చి ఎవరో పెద్దమనుష్యుడు వానితో భాషించగోరుచున్నా డనును. ఉక్కబోయుటచే పై నే వస్త్రమును దాల్చక కూర్చున్న అతడు వెంటనే లేచి చొక్కా దాల్చి ఉత్తరీయము ధరించి తల దువ్వుకొని అద్దము చూచుకొని అంతయు దిద్దుకొని అప్పుడు సేవకునితో వారిని ప్రవేశపెట్టుము అనును. ఒక పెద్ద మనుష్యుని చూచుటకు తాను పెద్ద మనుష్యుడు కావలసివచ్చును. ఎందులకు? వానిని సంతోషపెట్టుటకును వానిచే తాను ఎన్నబడుటకును. అట్లు చేయుటలో తన స్వాతంత్ర్యమును త్యజించి ఆ వచ్చిన పెద్ద మనుష్యుని అభిరుచికి అనురూపముగ నుండుటకు తన శక్తికొలది యత్నించును. ఆ వచ్చిన వా డొక మహాధనికుడు మహాకరుణాత్ముడు మహాగౌరవనీయుడు అనుకొనుము. ఇతడు దురాత్ముడనియు మోసగాడనియు భావింతము. అయినను తన గుణముల నన్నిటిని త్యజించి తాను పెద్దమనుష్యుడై వాని అనుగ్ర

హము నందుటకును వాని దృష్టిలో మంచివాడని అనిపించుకొనుటకును కడుంగడు వినయవిధేయతలతో ప్రవర్తించును. తాత్కాలికముగా అతని పూర్వాత్మ విడువబడును. దాని స్థానమున ఒక నవ్యాత్మ వచ్చిన వాని ఇష్టము ననుసరించి వాని ప్రేమను పొంద నర్హమైనది స్వీకరించబడును. అనగా ఆ వచ్చిన వాని స్థాయికి తనను లేవనెత్తుకొనును. లేకపోయినచో తా నొక ఎవ్వడోగా నిర్లక్ష్యము చేయబడును. ఒక మానవుడు ఈ వాంఛించుటలు ఈ ప్రేమించుటలు ఎందుకొఱకు? తన కొఱకే. ఇదే అర్థమును ఉపనిషత్తు చెప్పినది—'నవా అరే పుత్రస్య కామాయ పుత్రః ప్రియో భవతి। ఆత్మనః కామాయ పుత్రః ప్రియో భవతి'. పుత్రుని కొఱకు పుత్రుడు ప్రేమింప బడుట లేదు. వానిని ప్రేమించుటచే తన ఆత్మ సంతోషించుచున్నది. అనగా తన ఆత్మనే తాను ప్రేమించు చున్నాడు. నిజముగా భార్యను, బిడ్డలను, బంధువులను, మిత్రులను ప్రేమించుటచే దైహికమానసికబాధలు మాత్రమే లభించు పక్షమున ఎవ్వడును పుత్రమిత్రకళత్రబంధువులను ప్రేమించనే ప్రేమించడు. కాబట్టి ఒక మానవుడు తన పుత్రకళత్రములను ప్రేమించుచున్నా డనగా యథార్థముగా పుత్రకళత్రరూపములందున్న తననే తాను ప్రేమించు చున్నాడని అర్థము. సారాంశమిది. నే నొకరిచే ప్రేమింపబడుటకు యత్నించుచున్నా ననగా ఆ యెదుటి వానిలోనికి పరివర్తన మందుచున్నాను. అప్పుడా ఎదుటివారు నన్ను ప్రేమించగలుగుదురు.

ప్రతివాడును తన దేవునిచే ప్రేమింపబడ గోరును. దేవుడే తన కిచట గల సుఖభోగము లేవైన నీయజాలు సర్వసమర్థుడు. కాబట్టి దేవునిచే ప్రేమింపబడుటకు తాను గూడ కొంచెము దేవుడు కావల యును. కానిచో దేవునిచే ప్రేమింపబడుట కవకాశ ముండదు. అందు వలననే శ్రుతి 'దేవో భూత్వా దేవం యజేత్' దేవుడవై దేవుని పూజింపుము అని వచించును. ఆ కారణముననే భగవానునకును భక్తుల

కును శక్తియందు తప్ప ఎక్కువ భేద ముండదు. అచట సర్వశక్తి. ఇచట కించిచ్ఛక్తి.

ఇపుడు చూడుడు. నిరాకారుడైన దేవుని సేవించువాడు తన దేవుని లక్షణములను కొంచెము తా నవలంబింప వలయును. అనగా తానుగూడ నిరాకారుడు కావలయును. అప్పుడే తన నిరాకారదేవుడు తనను ప్రేమించును. తాను నిరాకారుడు కాదలచుచో ఈ శరీరము నతిక్రమించి పోవలయును. శరీరము నతిక్రమించుటకు శరీరముచే గ్రహింపబడు ఈ ప్రపంచము నతిక్రమించి పోవలయును. ప్రపంచము నతిక్రమించి పోవలయు నన్న తన ప్రియురాలైన ఇల్లాలితో ముద్దుబిడ్డలతో సుందరోద్యానభవనములతో నామయశస్సులతో మానమర్యాదలతో తన సంబంధ మున్న జనులతో తన కిచట ప్రియముగా నున్న ప్రతిదానితో సమస్తబంధములను త్రెంచుకొని పోవలయును. ఇట్టి స్థితిలో తన అర్ధాంగి చెంత కరిగి ఆమె అంగీకారము బడసి ఆమెతోడను తనకు ప్రియముగా నున్న ప్రతిదానితోడను గల బంధము లన్నింటిని విచ్ఛేద మొనర్చి, ఇట్లు శరీర మతిక్రమించి పోగలిగినచో అతడు నిజముగా నిరాకారుడైన దేవుని సేవించువా డనవచ్చును. కాకున్నచో అతడు కేవలవ్యర్థవాది. అతని నిరాకారదేవభావము అనంతాకాశము వంటిది. శూన్యమైన ఆకాశము దేవుడని అత డంగీకరించుటకు సిద్ధపడినచో అతని అజ్ఞానమునకు జాలిపడవలయును. మతధర్మము నత డెఱుగ డనవలయును.

నిరాకారుడైన దేవుని సాకారరూపమున నిబంధించుట అను నంశమున విమర్శకుల కొక విషయము స్మృతికి తేవలయును. మానవుడైన వా డెవ్వడును తన అయిదున్నఱ అడుగుల పొడవున్న శరీరములో తన మనస్సు నెప్పుడును నిబంధించలేకున్నాడు. మానవునకు శరీరమున

కంటె మనస్సు మిక్కిలి సన్నిహితము. కావున పుడమిపై గల ఏ మానవుడును తన శరీరమున నిబంధింపబడి లేడు. మనసు ఇప్పు డిచ్చోట నున్నది. ఈ క్షణమే దాని నాకాశమునకు సూర్యుని చెంతకు చంద్రు నొద్దకు నక్షత్రముల సన్నిధికి పంపగలను. ఒకటేమి, సమస్త ఊర్ధ్వ తేజోమండలముల పరిష్వంగము చేయించగలను. సూర్యుడు ఆ కను పట్టు కాంతిబింబమునందు మాత్రమే నిబంధింపబడి లేడు. తన అనంత మయూఖముల సర్వమును ఆవరించును. అదే విధముగ ఏ జీవియు తన శరీరమున నిర్బంధింపబడి లేడు. ఒక సామాన్యమానవునే ఒక శరీరమున పూర్ణముగ నిబంధింప వీలు లేకున్నప్పుడు, భక్తజనోద్ధర ణార్థముగాని విలాసార్థముగాని స్వీకరించిన శరీరమున దేవుని దివ్య మనస్సును నిబంధించుట మఱియు నెంత దుష్కరమో యోచించుడు. కావున దేవునికి ఒక రూప మేర్పఱచుటచే మన మాయనను నిబంధించితి మనుకొనుట అవివేకము. ఒక రూపములో నిబంధింప బడిన ట్లగపడు చున్నను అనంతుడైన దేవు నెవ్వరును నిబంధించలేరు. శ్రీకృష్ణుడు తన శరీరములో మాత్రమే నివిష్టుడై యున్నచో అర్జునునకు ఆయన విశ్వ రూపమును చూపుట అసాధ్యమై యుండెడిది. కాబట్టి ఎవ్వడు దివ్య సుందరరూపధారియైన దేవునిలో విశ్వాస ముంచుకొనునో ఆ దివ్య సౌందర్యమే అతని ఆత్మను పూర్ణముగ ఆ దేవునిపై లగ్నముచేయున ట్లాకర్షించును. ఇంచుమించు అతడు దేవోన్మత్తు డగును. ఆ దేవ సేవలో తన విధుల నన్నింటిని విస్మరించును. శ్రీకృష్ణకర్ణామృతకర్త యొక్క జీవితమును తిలకించుడు. అతడు యౌవనమున ఒక సాని పిచ్చిలో పడెను. గాఢమైన అతని ప్రేమకు ఆ సానియే అబ్బురపడినది. అట్టి పవిత్రప్రేమకు ఆశ్రయస్థాన మగుటకు తనకు అర్హత లేదని వగచినది. అప్పు డామె వచించిన మాట లివి-'ఓయీ! ఈ నిశితప్రేమను ఈ గాఢభక్తిని నీవు నామీదినుండి మఱలించి సర్వసౌందర్యనిధి బృందా

వనవిహారి యైన శ్రీకృష్ణభగవానుని మనోహరరూపమున నిక్షేపించి యున్నచో ఈ పాటి కొాక మహాభక్తుడ వయ్యేడి వాడవే! ఆయన అనుగ్రహభాగ్యము లభించి యుండెడిదే!' ఈ మాట లాయన హృదయమున గాటముగ నాటినవి. ఆ ప్రభావమున అతడు మహాభక్తుడే కాక మహాకవియు నయ్యెను. కావున ప్రాకృతికమైన దైహికసౌందర్యమే మానవుని పిచ్చిలో ముంచు శక్తి కలదేని దేవుని దివ్యసౌందర్యమును సందర్శించి తన యెడల ప్రసన్నతను సాధించుకొనగల పరమభక్తుని అది మిగుల పిచ్చిలో ముక్కలిడజేయు ననుట ఎంతయా? దేవుడు సర్వశక్తిమంతుడు దివ్యసుందరుడు దయాపూర్ణుడు. ఇది ప్రపంచమునందలి సర్వమతములు అంగీకరించిన విషయము. కావున నిజమైన భక్తుడు తన మతశ్రుతులయందు పూర్ణవిశ్వాస ముంచి తన దేవుడే సర్వసౌందర్యఖని యని నమ్మి ఆ సుందరరూపమును దర్శించుకొనుటకే అతడు నిరంతర ధ్యాననిష్ఠాగరిష్ఠు డైనచో అట్టి దేవుడు సర్వశక్తిసర్వసౌందర్యసర్వకారుణ్యప్రపూర్ణు డైనచో ఆ పరమభక్తుని నిరంతరధ్యానమును గమనించి నిశ్శబ్దముగ ఊరకుండగలడా? గీతలో శ్రీకృష్ణుని వాక్యము లివి - 'యే యథా మామ్ ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహమ్' ఎవరు నన్నెట్లు ధ్యానింతురో వారిని నే నట్లే సేవింతును. ఈ ప్రతిజ్ఞ దివ్యసుందరుడైన ఆ కారుణ్యనిధికి ఎంతయు తగి యున్నది. ఒక భక్తుడు తన ఇష్టదేవుని మనోహరాకృతిని దర్శించు ననుకొనుడు. అట్టి సౌందర్యమునుండి తన దృష్టి నన్యదిక్కునకు మరలించ నూహించునా? ఆ యాకృతిని సర్వనాశనము చేసి తన ఇష్టదేవునికి నిరాకారత్వమును కల్పింప నెపుడైనను కోరునా? అ ట్లెన్నడును జరుగదు. ఒక శలభము మండుచున్న దీపజ్యోతిని గాంచి ఉన్మత్తమై దానిలో బడి మరణించును గాని, దానినుండి తొలగిపోదు. అటులనే భక్తుడు తన స్వామి దివ్యసుందరరూపమును ఒక సారి సందర్శించెనో అత డింకొక రూపమువాడని ఎన్నడును

ఊహించలేడు. నీ ద్వైతము, నీ అద్వైతము, నీ విశిష్టాద్వైతము, నీ జ్ఞాత, నీ జ్ఞానము, నీ జ్ఞేయము, నీ వేదాంతతత్త్వము, నీ సమస్త వాదభేదములు అతనికి కేవలము వాగుబోతుతనముగ మాత్రమే కన్పట్టును. మధురమకరందముతో నిండి యున్న పుష్పముపై తుమ్మెద చేరి సమస్తమును మఱచి మధుపానమున మగ్నమై యుండు రీతి, అతడు సమస్తబంధములను మఱచి కేవల మా సౌందర్యరసానుభవమునందే నిమగ్నుడై యుండును.ఆ తన యిష్టదేవుని రూపము ఇంకేదో పొందుటకు సాధన మని గాని, నిర్గుణనిరాకారపరతత్త్వమును జేరుటకు మార్గమని గాని అత డనుకొనడు. దానికదియే పరమార్థముగ అతడు భావించును. అందుచే సహజముగ అతడు తన స్వామిని తన కధినేతగనో సఖునిగనో ప్రియుడుగనో అత్యంతాప్తమైన పితృరూపముగనో మాతృస్వరూపము గనో అతివాత్సల్యార్హమైన శిశుమూర్తిగనో భావించును.

బృందావనమందలి గోపికాగోపకులు శ్రీకృష్ణునిలో అట్టి దేవుని దర్శించిరి. వా రతని నొక సామాన్యమానవునిగ తలచలేకుండిరి. అ ప్రాకృతికమైన కృత్యములు అతిమానుషములైన శక్తులు అనుపమాన మైన సౌందర్యము అతడు దేవుడుతప్ప మ ఱెవ్వడును కాడని భావించుటకు కారణము లైనవి. యశోదానందులు ఈ దేవుని తమ ముద్దుబిడ్డ డనుకొనిరి. గోపబాలకులు తమ ప్రియమిత్రు డనుకొనిరి. గోపికాయువతులు తమకు ప్రాణనాధుడనియే భావించిన ట్లయిపోయిరి. ఋషులు అత డవతారమూర్తి యని గ్రహించిన వా రగుటవలన తమ స్వామి యనుకొనిరి. మఱి కొందఱు సకలభౌతికకర్మలకు సమస్తమానసికసంకల్పములకు ఆవల నున్న శాంతిమయునిగా వానిని భావించి వానియందు సదానంద శాంతులు పొందిరి. తమ మధ్య నిట్టి సులభగ్రాహ్యుడైన దేవుడు లభించుటలో బృందావనవాసులు మహాభాగ్యశాలురు కారా ?

పెక్కురు వైష్ణవతాత్త్వికులు శ్రీకృష్ణుడు దేవాధిదేవుడని భావింతురు. సృష్టికారకుడు బ్రహ్మకంటెను స్థితికారకుడు విష్ణువుకంటెను లయకారకుడు రుద్రునికంటెను అత డతీతుడని వారి ఆశయము. వారు చెప్పున దిది-ఈ త్రిమూర్తులు చేయవలసినవి కొన్ని విధు లున్నవి. కాన, వారు దాసులుగాని అధినాధులు కారు. దాసు లెవ్వరకు? మురళి చేబట్టి తన కాలమును గానమున బుచ్చుచు సృష్టి స్థితిలయ విధులను తమ చేతుల బెట్టిన స్వామి శ్రీకృష్ణునకు. నమ్మిన దాసులు స్వామిని పరివేష్టించి యుండి తమ యెదుట ఆయనను పనుల జేయనిత్తురా? సుదాసుని భావము తన స్వామి కేమాత్రము శ్రమయు కలుగకుండవలయునని. కాబట్టి దేవుని చుట్టును తీరియున్న అసంఖ్యాకదాసబృందము తమ స్వామి విధ్యుక్త కర్మబంధములలో జిక్కుకొనుటను చూడగలదా? అందుచే దేవుడు విధుల నతిక్రమించి యున్నా డనవలయును. ఒకవేళ అత డేమైనను చేసిన అది విలాసార్ధము. ఈ కారణముచేతనే వైష్ణవతాత్త్వికులు బృందా కృష్ణుడు మధురాద్వారకాకృష్ణునికంటె భిన్నుడుగ జూతురు. ద్వారకా కృష్ణుడు దాసుడుగాని స్వామికాడు. ద్వారకాకృష్ణుడు భగవదవతార పురుషుడనియు బృందాకృష్ణుడు కేవల భగవానుడే యనియును భావింతురు.

కృష్ణునకు యౌవనప్రాదుర్భావ మైనది. దివ్యవైభవమున మనోహరముగ నున్న వాని రూపమును గాంచి ముగ్ధయై సౌందర్యలక్ష్మి ఆ రూపమును తనకు నిత్యావాసముగ జేసికొనవలయు నని తన వివిధ నివాసతలములైన పూర్ణచంద్రుని పుల్లపద్మమును హసదుషస్సును హిమావృతసుమాళిని చిత్రవర్ణాంకితమగు నింద్రధనుస్సును మర్మర ధ్వనుల జలజల ప్రవహించు సెలయేళ్ళను స్వర్ణశిఖల వెలుగొందుచు మధురకూజితము లొనర్చు మయూరాదిశకుంతసంతానమును అకలం కములగుచున యోగిహృదయములను వీడి, నీడలుగ మాత్రమే వాని

నొనర్ప, నవియు సిగ్గు నొంది ఆ బృందావనసుందరమూర్తినే పిపాసతో జూడసాగెను.

అనివార్యమైన ఆ రూపసౌందర్యాకర్షణము అచ్చోటి యువతీ మండల మంతటిపై విజయము సాధించిన దనిన విశ్రాంతిపడు పని యే మున్నది? నిజముగా వా రాతని పిచ్చిలో పడిరి. ఆ బృందావన వీధిలో కాత్యాయని ఆలయము కలదు. దయావతియైన గౌరి తన భక్తు రాండ్ర పూజ లంది వారి కోర్కెలు తీర్చును. ఒక శుభదినమున గొల్ల పడచులు దేవాలయము జేరి సుగంధసుమముల పూజించి ఆ దిన మంతయు ఉపవసించి ఎవరికి వారు నందకుమారుడే తనకు పతి కావలయునని మనస్సుల కోరుకొనిరి. పూజలు ముగించి సంధ్యావేళ గుమి గూడి యమునాతీరము జేరి ఆ విమలజలముల జలక మాడదలచిరి. ఏకాంతముగ నున్న ఆ రేవున ఒడ్డుపై గుడ్డలు విడిచిపెట్టి యేటినీట దిగిరి. విలాసముగ ఉల్లాసముతో ఒకింత సేపు జలక్రీడ లాడి కనుచీకటి గ్రమ్ముచుండ తీరభూమికి చీర లందుకొన వచ్చిరి. కాని, ఒక్కటియు కానరాలేదు. ఆశ్చర్యమున అటు నిటు చూచిరి. వారిలో ఒక గోపిక గమనించి తా నెవ్వరికొఱకు వ్రతము సల్పెనో ఆ ప్రియుడు తమందఱ వస్త్రము లపహరించి అదుగో! ఆ చెట్టుపై నెక్కి కూరుచున్నాడని చూపెను. కొందఱు సిగ్గున మఱల నదీజలముల దిగిరి. కొందఱు బ్రతి మాలిరి. కొందఱు యాచించిరి. చీకటి పడుచున్నదనియు ఇండ్లయొద్ద తల్లిదండ్రులు తిట్టెదరు గాన త్వరగా పోవలయుననియు కొందఱు వమ బాధలు విన్నవించిరి. ఈ చిత్రమున కా గోపాలమూర్తి కదంబతరు శాఖపై నుండి నవ్వుచు ఇట్లనెను "కన్నెలారా! మీ రీ దినమంతయు ఎందుకొఱకు నుపవసించితిరో నే నెఱుగుదును. నా దృష్టిని తప్పుకొని నిలుచు రహస్యము లేదు. మీ ప్రేమను పరీక్షించుటకై నే నీ అకృత్య మొనర్చితిని. ఇందులకు నన్ను క్షమింతురని తలతును. మీ వస్త్రముల

నపహరించుట కేవలము క్రీడకొఱకు కాదు, ప్రేమపాఠమును మీకు బోధించుకొఱకు. ప్రేమించుట అనగా తనను తాను పూర్ణముగ విస్మరించుట. ప్రేమజీవి హృదయమున ప్రియుడో ప్రియురాలో వెలితి లేక నిండి పోపలయును. ఆ మనస్సున తద్భావమునకు తప్ప అన్యమునకు చో టుండరాదు. సిగ్గో తిట్టో మఱి ఏ దేదో ఊహ అచ్చోట నెలపు చేసికొనుట ఎట్లు? స్వార్థరహితమైనది ప్రేమ. దైహికము ఐహికము అయిన పెఱ తలపుల చొరనీయరాదు. అట్టి దివ్యప్రేమ నాపై మీకు స్థిరపడుగాక!'' ఇట్లని వారి వస్త్రములు వారి కిచ్చి శ్రీకృష్ణు డదృశ్యు డయ్యెను.

గోపకన్యలకు ప్రేమబోధ చేయుటకు శ్రీకృష్ణు డట్టి అసందర్భవేళ నేల ఎన్నుకొనెను అని కొందఱు ప్రశ్నించుట కలదు. జెనిసిస్ లోని మూడవ అధ్యాయము చూడుడు. ఆదాము అవ్వ-ఇద్దఱు వారి ప్రపాతమునకు ముందు పరమపవిత్రముగ నుండిరి. దిగంబరులైనను ఒకరి కొకరు అదర్శనీయముగ లేరు. దేవుని ఆనతి నతిక్రమించి తుచ్ఛవాంఛలకు లోనగుట తోడనే ఏకముగ నున్న భావములు ద్వివిధము లైనవి. మంచి, మంచి చెడ్డలుగ మారినది. తగినది తగనిది, సహ్యము అసహ్యము-ఈ తీరు ద్వంద్వము లేర్పడినవి. తమ దిగంబరత్వము అసహ్యముగ తోచినది. విశాలపర్ణములతో నగ్నతను బాపుకొనిరి. జననకాలమునవలె జగత్పిత యెదుటకు సహజనగ్నతతో బోవుటకు ఇప్పుడు వారి ముఖమున సిగ్గు తోచినది. అంతకు ముందు వా రైహికము నతిక్రమించి సురలకంటెను పవిత్రులుగ నుండిరి. ఆ వైభవము జాఱిపోయినది. రానున్న తమ సంతానము మాడ్కి తాము శ్రమింపవలసి వచ్చినది. శ్రీకృష్ణు డైహిక భావమునకు పై నున్నవాడు. సిగ్గుబాటును గూర్చు పనులు చేయజాలడు. దైహికమునకంటె ఉన్నతమైన సత్యప్రేమను పొందుడని గోపికల కాదేశించెను. వారి హృదయములు పూర్ణముగ వానినే నింపుకొనినవి. కావున వారిలో నాట జెప్పుటకు అదియే మంచి అదనుగ వానికి తోచినది.

ప్రేమతత్త్వము తల కెక్కువేళ అదియే యని గ్రహించినాడు. కావుననే ప్రపంచమునందలి సామాన్యమానవునియెడ క్షమించరాని ఈ కృత్యము శ్రీకృష్ణ పక్షమున అంగీకృత మైనది. అచట దోషము కాదు. అది ఒక శరద్రాత్రి. ప్రసన్నమచంద్రుడు దప్పిగొన్న పుడమిపై తన కిరణజాలముల అమృతమును వర్షించుచుండెను. ఒక మెల్లని చల్లని మలయపవనము కమ్మనైన పూలవాసనలను మోసుకొని వాని చెంతకు చేర వైచుచుండెను. యమున అవిరళముగ జాలువాఱు జలముల మంద్రస్థాయిలో మర్మరధ్వను లీను తరంగముల శ్రీకృష్ణలీలాతరంగముల మధురముగ బాడుచున్న ట్లాలపించుచుండెను. కలువపూలు తమ అచ్ఛమైన యెడదలు బయల్పడ నవకమున విచ్చి గాలిచెలికాని ముద్దులకు మురియుచుండెను. చల్లని నడకలు గల తోబుట్టువు లిద్దరు నిద్ర విశ్రాంతి అను వారలు తమ నిశా సంచారముల బృందావనవాసులలో సగముమందిని జేరిరి. అట్టి తఱి శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవిని చేగొని యమునాతీరతటమున తరులతావళుల చెంత ఒంటరిగ గూరుచుండెను. చుట్టును ఆవరించియున్న సౌందర్యము కూర్చిన పారవశ్యములో మురళిపై మనోహరముగ గానము సేయ సాగెను. అనుకూలపవనము ఆ గానమాధుర్యమును ఎల్లెడకు కొని పోయెను. గృహముల నున్న గోపాంగనల వీనులకు ఆ ధ్వని సోకి నంతనే ఇంచుమించు ఉన్మాదము కలిగిన ట్లయ్యెను. ఒక జవ్వని పా లానుచున్న చంటిబిడ్డను తొట్టెలో విడిచి, ఏడ్చుచున్నను లెక్కచేయక చెలుని గలియుటకు పరుగెత్తెను; ఒక యెలనాగ విందారగించుచున్న పెద్దలకు వడ్డన సేయుచు పళ్ళెరము నావలవైచి పరువెత్తెను; ఒక యువతి తల దువ్వుకొనుచు వీడిన కేశజాలముతో చేత దువ్వెనతో పరుగెత్తెను; ఒక వనిత వంట జేయుచు ఉడుకు పట్టి సిద్ధమగుచున్నవేళ కుండను పొయ్యిపై వదలియే పరువెత్తెను; ఒక అంగన పడక టింట మగనితో పాటు శయ్యపై నుండి లేచి పరువెత్తెను. ఈ రీతి గోపయువతు

లందఱు మురళీనాదమాధురుల గ్రోలి వెఱ్ఱియెత్తినట్లు ఎట్టి స్థితియం దున్నను గణనసేయక యమునాతీరతటమునకు తమ ప్రియుని గాంచు త్వరతో పరువు లెత్తిరి. ఇండ్లలో తమ తమ పెద్దలు తల్లిదండ్రులు మగలు తోడబుట్టినవారు తిట్టుచున్నను చివాట్లు పెట్టుచున్నను ఈసడించి వెళ్ళిరి. లజ్జాభిమానములు పరువుమర్యాదలు లోకాతీతమైన ఆ మహా కర్షకమూర్తిచెంత త్యాగము చేయబడినవి. ఇంటినుండి పయన మగు వేళ ఎవరికి వారు ప్రతివారును తా నొంటరిగ తన ప్రియుని ఆ యమునా నదీసైకతస్థలమున ఏకాంతముగ పండువెన్నెలలో చల్లగాలిలో కూడ గలనని తలచిరి. కాని నడిబాటయం దందఱును కలసిరి. చివర కొక గుంపుగా తమ మనోహరుని చేరిరి.

అట్టి అర్ధరాత్రి వ్రజాంగనాసమూహము తనను జేరుట జూచి శ్రీకృష్ణుడు విస్తుపోయెను. గోపకుల కేదో క్రొత్త యిక్కట్టు పైబడి దానినుండి రక్షింపుమని తన సహాయ మర్థించుటకు వచ్చినా రేమో అను కొనెను. అంతట 'ఈ నడురేయి మీ రిటకు రా గతమేమి?' అని అడిగెను. వారు మాటాడలేదు. 'మధురమురళీగానవశులై నేను మ్రోగింప చూచు టకును వినుటకును వచ్చితిరా?' అని మఱల అడిగెను. ఆపత్సంబంధ మయిన ఆత్రము వారి ముఖములందు గోచరింపకుండుటచే తప్పక తన సౌందర్యము గానము వారి నాకర్షించగా వచ్చిరని నిశ్చయించుకొని ఇట్లు మందలించెను-'యువతులారా! పెద్దలను భర్తలను ఈసడించి స్వైరగతి నిట్లు వచ్చుట తగునా? సహధర్మిణులు పతుల ప్రేమించవలయును. తల్లులు బిడ్డల పాలించవలయును. చిన్నవారు పెద్దవారి సేవించ వలయును. పతివ్రత భర్త కుంటియైనను గ్రుడ్డియైనను కుష్ఠరోగియై నను ప్రేమించి భక్తితో పరిచర్య చేయవలయును. అట్లు వర్తించిననే జననము సఫలత నొందును. పొండు. మీ మీ నివాసములకు తిరిగిపొండు. కృష్ణుని ఈ పలుకులకు గోపికలు విలపించిరి. ప్రణయకోపము వహించి

వానితో ని ట్లాడిరి-'మనోహరుడా! మరలి మా యిండ్ల కేగుట మా వశమా? దివ్యసౌందర్యధామమైన నీ రమ్యరూపము మా సర్వేంద్రియములపై మచ్చు చల్లినది. మా ఆత్మ నిశ్శేషముగ నీపై కేంద్రీకరింపబడినది. మా చలనశక్తి సంతతిని దొంగిలించి నీవు మ మ్మిప్పుడు పొ మ్మనెద వేల? అసలు మే మెట్లు పోగలము? విభ్రాంతి గొల్పుచున్న నీ రమణీయాకారమును విడిచి అడుగైనను కదల్చుట మా తరము కాదు. వ్యాళము యొక్క మెఱయుచున్న నేత్రయుగళము జూచి ఆకర్షింపబడి భ్రాంతి గొనిన విహంగము తన కులాయమునకు మరలి పోగలుగునా? అది అ వ్యాళవిషము గహ్వరమున బడి మరణించును గాని మరలి గృహమున కేగు భాగమే దానికి కల్గుట అసాధ్యము. ఆ భ్రాంతిలో తనకై ఎదురు తెన్నులు కాచు చెలికాని పసిపిల్లలను మఱచిపోవును. మాస్థితి అట్లున్నది' ఇట్లని వారు మౌనము దాల్చిరి. శ్రీకృష్ణునకు జాలి కలిగినది. వారితో గూడి గానము చేసెను. నాట్యము లాడెను. అద్దాన వారి హృదయములు పొంగి పోయినవి. ప్రపంచమున తమకంటె మిక్కిలి అదృష్టము కల యువతు లిక లేరని పెంటి నెమళ్ళవలె కేకలు వేయ బట్టిరి. వారి మనోంతరాళముల గర్వము ప్రవేశించినది. ఆ గర్వమును త్రుంచి వేయుటకును తనపై గల ప్రేమను పరీక్షించుటకును వెంటనే తిరోహితు డయ్యెను.

అసహాయలైన గోపికలు తమ గర్వమే తమ ప్రియు డదృశ్యు డగుటకు కారణమని తెలిసికొని విచారమున విరహోన్మత్తలైరి. వారి హృదయముల శ్రీకృష్ణవిషయకము గాక అన్యభావ మెద్దియును లేకుండెను. అనుక్షణము వారి సర్వజీవనము శ్రీకృష్ణునియందే నిల్పి వర్తించిరి.వారి తలపు లెల్లను సహజముగ వాని కృత్యములందును వాని రూపసౌందర్యమందును వాని బలశౌర్యములందును సంచరింప సాగెను. కొందఱు గోపికలు తామే కృష్ణుడైనట్లు భావించి అన్యగోపికలను కంస ప్రేషితలైన రాక్షసాంగన లనుకొని పట్టి లాగ దొడగిరి. గృహములను

బంధువులను బిడ్డలను మఱచి వారీ రీతి తమ ప్రియుని కృత్యము లనుకరించిరి. విసిగి వేసారి తుదకు వాని నావనమం దన్వేషింప బూనిరి. వెఱ్ఱిగా పృథివిని తరువులను లతలను పుష్పములను 'మీరు మా ప్రియుని జూచితిరా' యని ప్రశ్నించిరి. ఒక చోట వాని అడుగుల జాడలు కన్పట్టినవి. వాని ప్రక్క మఱియొకరి పాదచిహ్నములు సైత ముండెను. అది చూచి, ప్రియుడు తనకు అత్యంతము ఇష్టురాలైన గోపిక నెవ్వతెనో ఏకాంతప్రదేశమునకు తమ నందఱిని వీడి కొంపోయినాడని ఊహించిరి. ఆ అడుగుల బట్టి మఱి కొంత వెదకిన పిదప కొంత దూరమున ఒక గోపయువతి బిగ్గరగా నేడ్చుచుండుటను గాంచిరి. అటకు వేగమున బరుగెత్తి ఆమె విలపించుటకు హేతువు నడిగిరి. ఆమె చెప్పినది- 'గర్వమున నిండియున్న మిమ్ముల విడనాడి ప్రియుడు నన్ను వెంటగొని పచ్చి పూలతో నన్నలంకరించి ఏకాంతమున అటు నిటు బహుదూరము త్రిప్పి నాలోనను గర్వము పొడసూపి 'నడువ జాలను. నన్నెత్తుకొని పొ'మ్మని నేను ప్రార్థింప పల్లెయని సంసిద్ధుడై నే నాతని బుజముం నధిరోహించు వేళకు తిరోహితు డయ్యెను. ఈ నిర్జనవనవీధి నొంటరిగ నున్న నేను దిక్కు గానక నిస్సహాయనై దుఃఖించు చుంటిని.' ఆమె మాటలకు వారు మిగుల జాలి నొందిరి. అందఱును కలసి యమునానది చెంత కేగిరి. ఆ తటమున గూర్చుండి ఇండ్లను మగలను బిడ్డలను తమ దనుకొనిన దాని నంతటిని మఱచి దృఢమైన దీక్షతో గాఢమైన ప్రేమతో హృదయములను పూర్ణముగ ఏకాగ్రము చేసి ఆర్తనాదమున 'మనోహరా! మా దోషములు మన్నించి మా యందు కరుణించి మరల మా చెంతకు రమ్మ' అని ప్రార్థించిరి. ఆ అభ్యర్థనము నంగీకరించక తప్పినది కాదు. శ్రీకృష్ణుడు ప్రత్యక్ష మయ్యెను. గోపికలలో వానికి తోచినది తుచ్ఛ వాంఛకాదు. ఉన్నతమైనది ఉత్తమమైన దేదో కాకున్నచో గృహముల వీడి అట్టి సాహసము చేయ జాలరు. భయము సిగ్గు ప్రాపంచికబంధములు

వారి నరికట్ట జాల కుండెను. ఈ తూరి వారియందు జాలికంటె గౌరవ మేర్పడినది. స్వభావముచేతనే సుందరమైన తన శరీరమును పూలచే నలంకరించి వనమాలియై మఱింత సుందరము చేసికొని అతిలోకరమ ణీయాకారు డయ్యెను. తన దివ్యశక్తివిశేషము వలన ఎందఱు గోపిక లుండిరో వారి కనురూపముగ నందఱు కృష్ణుల నావిర్భవింప జేసెను. ప్రతి గోపికయు తన కృష్ణుని చెంత చేబట్టి నిలచెను. ఎల్లరు ఆనందమున ఆడిరి. పాడిరి. నాట్యములు చేసిరి, కౌగలించు కొనిరి. ముద్దులాడిరి. అలసట జనించు పఱకు క్రీడావిలాసముల సంతోషతరంగముల నోల లాడిరి. చిట్టచివరకు యమునాజలముల బ్రవేశించి నీరాట లాడి నిర్మల దేహులై వెలికి వచ్చిరి. ఆపై ఎవరి గృహములకు వారు పోయిరి. వారిం గాంచి రాత్రి అంతయు లేరని సందేహించిన వా రొక్కరును లేరు. కారణ మేమన శ్రీకృష్ణుని అమోఘశక్తి చే ఆ రేయి ఎవరి భర్తలచెంత వా రుండిరి. శ్రీకృష్ణుని జీవితమునందలి ఈ ఘట్టమును రాసలీల అందురు. దీని ననేకులు మహాదోషముగ నెన్నుట కలదు. వారు చేయు మహాపచార మేమన. శ్రీకృష్ణుని సామాన్యమానవులలో జమ కట్టెదరు. ఈ దివ్య మానవుని శక్తిని గూర్చి పరిశీలించి యుంటిమి. మనవంటి వా డను కొనుట తగునా ? వాని జీవితమున ప్రతి అంశము మానవాతీతము. అట్టిచో అతడు మానవు డనుకొనుట భావ్యమా ? మానవమాత్రుడు కాని వాని విషయమున మానవుల దృష్టితో యుక్తాయుక్తములు నిర్ణయించుట కూడదు. మనకు చెడుగైనది అపనికి మంచి దగును. పసిబిడ్డకు పాలు ఆహారము. కూర కలిపి నేయి పోసిన అన్నపు ముద్దను దాని నోటిలో తుఱిమిన అది మరణించును. పసిబిడ్డ క ట్లన్నము పెట్టుట నేరము. అదే అన్నము పెరిగిన వానికి ఆరోగ్యకరము బలవర్ధకము. ప్రతిదిన మ ట్లాతడు తినినచో ఆయురారోగ్యములు పెంపొందును. కావున ఒకచో లాభమైనది ఇంకొకచో నష్టము. మానవుని యెడ నేర మనుకొనినది

దేవుని పట్టున స్తవనీయము కావచ్చును. ఆకట దపించుచున్న దరిద్ర భిక్షుకుడు ఒక బేడబిళ్ళతో రొట్టెను కొని ప్రాణము నిలుపు కొనదలచి ఒక మహాధనికుని చేరి ఈ దానమున నష్టము రాదనియు తన ప్రాణము నిల్చు ననియు ప్రార్థింప అత డా భిక్షుకుని తిట్టి గెంటివేసిన అట్టి నీచుని రాక్షస భావుని మన మెట్లు చూతుము? అతని పేరైనను తలచుటకు మన కిచ్ఛ పొడమదు. అత డంత అసహ్యాముగ మనకు కనబడును. దైన్యమున అర్థించు గోపికాంగనల గాఢవాంఛల నన్నింటిని తీర్చుట వానికి లెక్క లోనిది కాదు. సర్వసమర్థత గల శ్రీకృష్ణుడు వానిని తిరస్కరించినచో నిందార్హుడే యగును. ప్రాపంచికవిషయము లతనిని వశపరచు కొనలేక పోయినవి. ఇంద్రియముల కతడు దాసుడు కాడు. వానిని జయించిన వాడు. శుకదేవుడు వానిని ఆప్తకాముడని ఆత్మారాముడని వర్ణించి నాడు. కోరికలు లేనివాడని తన యందే రమించువాడని దాని యర్థము. అట్టి వ్యక్తి ఇంద్రియవిషయము లన్నింటిచే క్రమ్మబడినను నిర్వికారుడే యగును. వాని నత డధిగమించినవాడు. రుద్రుడు అన్ని విధములయిన విషమును జీర్ణించుకొనగలడు. అగ్ని అన్ని వస్తువులను దహించ గలదు. అటులనే బృందాగోపాలుడైన కృష్ణుడు తన అతిమానుష శక్తిచే తృణప్రాయముగ సర్వేంద్రియవిషయములను నిగ్రహించ గలడు. కాని, ఒక నరుడు గాని నారీమణి గాని రుద్రునివలె విషమును మ్రింగరాదు. అటులనే శ్రీకృష్ణుని అనుకరింప దలచి స్త్రీపురుషసౌందర్యములకు భ్రాంతి నొంది అంత చనువుగ సంచరించరాదు. దూరమున నుండుటయే తగును. మంత్రకాడు విషముగల సర్పమును జేరి ఆడించును. దూరమున నుండి అది రమ్యముగ నున్న దనుకొనుట యోగ్యము. అతనివలెనే మనమును దానిచెంత జేరితిమా మృత్యువువాత బడవలసి వచ్చును.

ఈ విచారణము వలన దేవుని కృత్యములను మానవు డనుకరించి మరణించునని సిద్ధాంతము. తద్బోధనము ననుసరించి వర్తించుట

మనకు కర్తవ్యము. తైత్తరీయోపనిషత్తున అంతేవాసులను గూర్చి ఋషి బోధించును 'సత్యం వద। ధర్మం చర। —— యా న్యస్మాకగ్ం సుచరితాని తాని సేవితవ్యాని। నో ఇతరాణి' సత్యమును పలుకుము। నీ విధ్యుక్తధర్మమును నిర్వర్తింపుము। —— మా కృత్యములలో నీ కేది క్షేమము కూర్చునో దానినే అనుసరించుము। కాని అన్యములు వలదు। — ఎవ్వరు భౌతికములు ఐహికములు అయిన బంధముల నతిక్రమించిరో వారి కే విధులును లేవు. విధినిషేధములు వారిని బంధించవు. సంఘముతో నెందాక నరుడు సంబంధ ముంచుకొనునో అంతవఱకు దాని ధర్మముల కతడు బద్ధుడు కావలయును. సంఘము అనుదాని సూక్ష్మరూపములో ఇద్దఱు సభ్యు లుందురు. అందునను ఒకరి భావముల నొకరు మన్నించ వలయును. బంధములు కొలదియే కావచ్చును. సంఘము పెరిగినకొలదిని సభ్యుల సంఖ్య పెరుగును. భిన్నభావములవా రుందురు. అభిరుచులు భేదించును. బంధములు పెరుగును. అట్టిచో అనుసరించవలసిన ధర్మము లనంతములు. అటువంటి సంఘమున సభ్యుడైన వాడు ఆ సూత్రము లన్నింటిని పాలించవలయును. అవి ఆ సంఘక్షేమమునకే ఏర్పఱుప బడినవి. నీతిసూత్రములు ఆరోగ్యసూత్రములు చేయతగినవి చేయఁగనివి దండార్హములు క్షమార్హములు ఇ ట్లనేకములు. నిజమైన ఋషి సంఘము నతిక్రమించినవాడు. పూర్ణముగ స్వతంత్రుడు. కాన శాసనములకు బద్ధుడు కాడు. అతడు సంఘములోనున్నను సంఘమున కతనిలో తావు లేదు. తామ రాకు పుట్టినది మొదలు నీటిలోనే కలదు. కాని నీరు దానిని చొరనేరదు; దాని కంటుకొనజాలదు. అందుచే నతడు సంఘమునం దున్నను సంఘసభ్యుడుగా పరిగణింపబడ జాలడు. కావుననే మన మాతని విషయములను సంఘ సూత్రముల కొలతతో నిర్ణయింపరాదు. శ్రీకృష్ణుడు యువతీసంఘములో వర్తించినను వానిలో నెవ్వతెకును తావు లేదు. అట్టి మహాత్ముడు చేసినను చేయనివాడు. తినినను తిననివాడు. (ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత

ఇతి ధారయన్। బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః। లిప్యతే న స పాపేన పద్మపత్ర మి వాంభసా ।)

ఈ మాటలు విని ఇట్లనవచ్చును. 'అట్లయినచో ఋషి యగుట తేలిక. బాధ్యతారహితమైన స్వైరప్రవృత్తము నవలంబించి నేను ఋషి ననవచ్చును' అని. ఇట్లనువారు గొప్ప పొరపాటు పడుచున్నారు. నిజమయిన ఋషులు ధర్మదూరము నీతిదూరము అయిన జీవితము గడపు వారని ఎన్నడును మన మాక్షేపింపజాలము. ఉపరి. వారు నీతి రూపు గొన్న మూర్తులు. నీతి అనగా ఏమి? ఒక మానవుని వాంఛితములు ఒక పరిమితిని దాటిపోనప్పుడు మన మాతని నీతిమంతు డందుము. కాని ఈ ఋషులకు వాంఛితములే ఉండవు. అట్టిచో వారు అవినీతిమంతు లగుట ఎట్లు? లోకములో కొన్ని వేళల నీతిమంతు డవినీతిమంతు డగుచున్నాడు. అతడు వాంఛితములను త్యజించలేదు. అవి స్వర్గమందలి అమర్త్యునైనను క్రిందికి లాగగలవు. అట్టిచో ఎంత నీతికి కట్టుబడి యున్న మానవుడైనను ఇంద్రియవిషయముల ఆకర్షణమును నిగ్రహించలేడు. కాని చీకటులు సూర్యుని చేరజాలని విధమున అమర్త్యులకంటెను అధికులగు ఋషులను విషయములు చేరజాలవు. ఒక చిన్న మనుష్యుడు ఒక పెద్ద మనుష్యుని అనుసరించవచ్చును. వా రిరువురును మనుష్యులే. మానుష్యకము నతిక్రమించినవారు కారు. అందుచే వారి కృత్యములు హానికరములు కావు. ఆ అనుసరణము మంచినే కూర్చును. కాని మానవు లనుటకు వీలు కాని మానవాతీతుల కృత్యము లన్నింటిని మన మనుసరించరాదు. అవి మన కపకారము కూర్చును. ఒకప్పుడు ప్రాణమునుకూడ తీయగలవు.

శ్రీకృష్ణునిపై గోపికలకు గల ప్రేమ తుచ్ఛమైనది కాదనుటకు కారణము గనుడు. నాటిరాత్రి గృహములనుండి పెద్దవారిచే పోనీయబడక

ఆగి నిర్బంధము ననుభవించిన కొందఱు గోపికలు తమ మనోహరుని పూర్ణప్రేమతో స్మరించి ప్రాణములు వీడిరి. వారి ఆత్మలు ఐహికబంధములు తప్పించుకొని వాని చరణములచెంత జేరగా అత డాదరమున స్వీకరించెను. సామాన్యమర్త్యులకు భీతి గొల్పు మృత్యువు వారికి ఆటపెస్తువైనది. వారి ఇచ్ఛానుసారము దాని నతిక్రమించిరి. పరిశుద్ధమైన ప్రేమయొక్క అనిర్వచనీయశక్తి అట్టిది. ప్రథమమున శ్రీకృష్ణుని దివ్యసుందరరూపము వారి నాకర్షించిన మాట నిజమే. కాని అదియే వారిని స్వార్థమును మఱచునట్లు చేసినది. అవసానమున అదియే వారిని దైహికబంధముల నతిక్రమించి పోవున ట్లొనర్చినది. ఇట్టి ప్రేమము తుచ్ఛము లేక వైషయికము అన దగునా ?

కొందఱు ఈ రాసలీల నంతటిని ఆలంకారికముగ జూతురు. వారి పక్షమున గోపిక లనగా సాత్త్వికభక్తిగలవారు. బయటికి పోయి తమ భక్తిని సమాజమున ప్రదర్శింపక తమ ఏకాంతగృహముల ధ్యానమగ్నులై ఆత్మ నంతటిని దేవునిలో విలీనము చేయువారు. తమకు భక్తి ఉన్నట్లు ఎవ్వరికిని తెలియనీయరు. ప్రపంచము వారు సామాన్యులనియే భావించును. కాని వారి హృదయము దిక్సూచియంత్రమునందు ముల్లువలె ఎప్పుడును ఆ దిక్కునే చూచుచుండును. గోపికలు గార్హస్థ్యధర్మము లనుసరించి తల్లులుగను భార్యలుగను వర్తించినను వారి ఆత్మలలో నెల్ల వేళల శ్రీకృష్ణుడు నిబిడముగ నిండియుండెను.

ఈ విధమున రామకృష్ణులు బృందావనమున మఱికొంత కాలము కంసునిచే పంపబడిన రాక్షసుల సంహరించుచు వసించిరి. కంసు డా సోదరుల నిర్వురిని పిలిపించి తన యెదుట బలిష్ఠులచే చంపించ దలచెను. అందుల కాతడు మల్లయుద్ధప్రదర్శనోత్సవము నేర్పాటుచేసి దానిని దర్శించుటకు సపరివారముగ రమ్మని నందున కాహ్వానము పంపెను.

ప్రత్యేకము రామకృష్ణుల గొంపోవుటకు అక్రూరుడు రథము తోలుకొని వచ్చెను. నందాదులు కంసునకు తగిన కానుకలు సమకూర్చుకొని తమ తమ బండ్లపై వెనుక వచ్చుచుండిరి. అక్రూరుని రథము రామకృష్ణులను గొని యమునాతీరమునకు వచ్చినది. నది దాటినగాని కంసుని పురము, మధురానగరము చేరరాదు. అది మధ్యాహ్నము. ఉడకపోతకు స్నానము చేయదలచి రామకృష్ణులు రథ మాపి దిగిరి. వైష్ణవకవులు ఈ ఘట్టమున ఒక విషయము చెప్పెదరు. గోపాలబాలుడై లీలావిహారియైన బృందా కృష్ణుడు యమునాజలముల మునిగి ఇక లేవలేదు. ఆ స్థానమున వేఱొక కృష్ణు డావిర్భవించెను. అతడు వైదికధర్మోద్ధారకుడు తాత్త్వికుడు వీరుడు రాజ్యాంగవేత్త.



# మధుర

'అవసరము అన్వేషణమునకు తల్లి' అను నాంగ్లసామెత కలదు. మన కేదైనను ఒక విషయము మిక్కిలి అవసర మయినప్పుడు, ఆ ప్రబలవాంఛ మనలో ఉత్పన్నమై దాని పరిపూర్తికి ఒక మార్గమును త్రొక్కును. ఒక స్త్రీగాని పురుషుడుగాని అట్టి త్రోవను ప్రప్రథమమున త్రొక్కిన భాగ్యశాలురు లోకముచే వెల్లుగ వినుతింపబడుదురు. ఈ లోకమే సర్వమని దీని బంధమే పరమార్థమని భావించు వారలు ప్రాపంచిక భావావిష్టులైన స్త్రీపురుషులను భక్తులు భగవంతునివలె గౌరవింతురు. కొలంబస్, జేమ్సువాట్, ఫ్రాంక్లిన్, జార్జ్‌స్టీవెన్‌సన్, ఎడిసన్ - ఇంకను ఇట్టి కొందఱు పాశ్చాత్యులచే దేవునికంటె ఇసుమిక్కిలిగ స్తుతింపబడుచున్నారు. ఇంద్రియాతీతమైన జన్మాంతరము పరము పరమాత్మ - వీనియందు విశ్వాసముకలవారు కొలదిమంది మాత్రమే. కాని ఈ దృశ్యప్రపంచమునకు హేతువును గూర్చి శాస్త్రీయవాస్తవికవాది ఎంత తప్పుకాని పోయినను ఇంచుమించు నరనారీగజ త్తంతయు లోకాతీతమైన ఒక చైతన్యము దీనిని పాలించుచున్నదనియు ఈ దృశ్యమును నడపుచున్నదనియు నిరూఢమైన విశ్వాసమును కలిగి యున్నారు. కొన్నివేళల భౌతికము ప్రాపంచికము ఈ భూగోళవాసుల దృక్కులను ఇహము ఐహికమునందు మాత్రమే మగ్నులై పోవునట్లు చేసినను మానవస్వభావమును అవి తుడిచివేయలేవు. జన్మాంతరజీవనము శాశ్వతసుఖము పూర్ణజ్ఞానము - వీనిని గూర్చిన దాహముతో తపించు మానవస్వభావము వానిం గాంచక శమించనేరదు. మూఢుడు తన మౌఢ్యమును గూర్చి లోక మనుకొనుట సహించడు. తోడివారికంటె తక్కువ వాడుగా పరిగణింపబడుటకు కోరడు. మృత్యువు నెవ్వడును వాంఛించడు.

దుఃఖము నెవ్వడును ఇచ్ఛగించడు. ప్రతిమానవుని స్వభావమును ఇవి స్పష్టముగ చూపుచున్నవి. శాశ్వతమైన జ్ఞానముతో కూడిన ఆనందము ఆ స్వభావము. దీనిని సచ్చిదానంద మందురు.

మానవుడే శాశ్వతుడే అయినచో అతని కీ శరీరముతో సంబంధమే లేదు. దీని కొౕక ఆది ఒక అంతము కలదు కావున, అతడు సదానందుడే యగుచో అప్పుడును అతనికి శరీరముతో సంబంధము లేదు. నరములు వ్యాపించి యున్న ఈ దేహము సుఖమును దుఃఖమును గూడ ఇచ్చుచుండును. అతడు జ్ఞానరూపుడే యయిన పక్షమున అత డీ శరీరమున ఎట్లు నిబంధింపబడి ఉండగలడు? జ్ఞానమున గ్రహింపదగిన విషయములు ఈ విశ్వమం దెల్లయెడల వ్యాపించి యున్నవి. వానిని తెలిసికొనవలయు నన్న వానితో సంబంధ ముండవలయును. అందుకుగాను అతడు బంధరహితుడై అనంతుడు కావలదా? ఈ గతి హేతుపథమున బోయి చూడగా నిజమైన మానవుడు ఆకారము లేనివాడును నామము లేనివాడును అయి యుండవలయునని తేలును. హేతువు మన కేమి చెప్పినను మనము పుట్టినది మొదలు రూపనామముల భావమునే కలిగియున్నాము. లోకమునందలి వా రెల్లరు ఈ నామరూపములు తమనుండి విడదీయ రానట్లు మిశ్రితములై యున్నవని భావింతురు. అందుచే ప్రతి స్త్రీయును ప్రతిపురుషుడును అస్థిమజ్జామేదోమాంసకీలాలనాళపూరమయిన ఈ అయిదున్నఱ అడుగుల పొడవున్న శరీరమే తానను భావముతో నుండుట ఆశ్చర్యము కాదు. అనంతమయినది ఈ పంజరబంధమునం దొదిగి అట్లు భావింప బడుచున్నది.అది స్త్రీగనో పురుషుడుగనో అయినప్పుడు ఆవ్యక్తి తన శక్తులు నియమితములని స్వల్పములని భావించును. అవ్వాని మనస్సులో కొలది ఊహలు మాత్రమే పట్టును. ఆ శరీరము కొద్ది పౌనుల బరువే ఉండును. నీ వెంత బలవత్తరముగ నిరాక్షేపణీయముగ వానితో వాదము చేసినను అత డనంతుడని ఒప్పించగలుగుదువా? అతడర్థము

చేసికొనినప్పటికిని తా నొక దేహముకలవాడ నను భావమును వదలుకొన గోరునా? శరీర మత నికి దుఃఖమునిచ్చును. కాని ఒకప్పుడు సుఖమును గూడ ఇచ్చుట కలదు. ఈ శరీరము మూలమునసే ఆ దూరమం దున్న పూబోడి తన భార్య యని ఆ ముద్దుగ నాడుకొనుచున్న ముత్తెములవంటి బిడ్డలు తన సంతానమని అతడు భావించగలుగుచున్నాడు. ఈ పుడమి దాని మనో హరదృశ్యములతో మధురముగ బాడు విహంగమండలితో పరిమళము లీను పుష్పజాతముతో స్వాదురసముల నిండు ఫలావళితో సుఖస్పర్శను గూర్చు మందానిలముతో సుందరముగ లేదా? శరీరము లేకున్న ఇవి యన్నియు అనుభవింపబడుట యెట్లు? కావున ఓ కోవిదుడా! నీ వేదాంతమును కట్టిపెట్టుము. ఆ సౌందర్యమును మానవు ననుభవింప నిమ్ము. జగ మంతయు సుందరముగ లే దందువా? సుందరమైన దాని చెంత వికారమైనదియు కలదు. సుందరమైన దాని సౌందర్యమును ఇంకను గొప్పచేయుటకు కాదా అదియు నుండుట? మంచిని ఆనుకొని చెడు గున్నచో మంచియొక్క సౌందర్యము నతడు కీర్తించగలడు. అనుభవించగలడు. లేనియెడల మంచికి రుచిగాని ఆకర్షణముగాని ఉండదు. ఆలుబిడ్డలకొఱకు మానవు డీ జగమును త్యజించలేడు. అతనికి భ్రమ పుట్టించుటకు ఈ ప్రకృతి సతతము నూతనములు ఆకర్ష కములు సుందరములు అయిన వస్తువులు కూర్చుచున్నది. ప్రకృతిచే వ్యామోహితు డగుచున్నాడు. అందుచే ఆమె అందించు విషగుళికలను అతడు నిస్సంకోచముగ మ్రింగగలడు. వానిలో ఆమె లోభితనముతో కలిపిన మధుగుళికలు ఒకానొకటి ఎప్పుడో ఒకప్పుడు తోచవచ్చును. ఈ మోసమును అత డెంతకును కనుగొనలేడు. కాలము గడచును. కవాటము పైన మరణధ్వానము వినిపించును. భూమిపై నీకు ప్రియమైన సన్నిహిత మైన వారల యొద్ద సెలవుగైకొని ఆలసింపక త్వరగా రమ్ము అను విచారకరమైన ఆనతి వీనులకు సోకగా అత డిట్లనును - 'ఇచ్చోటు వీడి

పోవలయునా ? ఇది నా భవనము కాదా? ఎచ్చ టెచ్చటి కేగిన వారును తమ తమ నెలవులకు వత్తురే! నేను నా గృహమును వీడి పోవుట ఎందులకు?'

ఈ ప్రశ్నలు పెడచెవిన పెట్టబడును. 'సిద్ధ మగుము. వేళ అయినది.' అను మాటలే మరల వినిపింపగా 'అట్లయిన ఇది నా గృహము కాదా?' అనుచు మానవుడు చింతించుచు వ్రాలిపోవును. భార్య విలపించును. బిడ్డలు వింతగా జాలిగా చూతురు. ఒక వేదన అతని గుండెలను కదలించి వేయును. శరీరము చల్లబడును. నిరాశానిర్వేదములతో గూడిన నిశ్శ్వాసమును కడసారి అతడు విడచును. దేహమును శాశ్వతముగ విడిచి పోవును. ప్రకృతిచే వంచింపబడి మరణించినాడు. మోసమునకు పుట్టినిల్లయిన ప్రకృతి విషపూర్ణయై బాహ్యసౌందర్యముతో కులికి భ్రమ పుట్టించును. ప్రపంచమునందలి మానవుని జీవనవిధాన మిది. ఏ మానవుడు ప్రపంచము నందలి వాడు కాడు ? ప్రతివాడును తన గృహ మిచట కల దనుకొనును. ప్రతివాడును దానిని విడిచి పోవుటకు ఎల్లప్పుడును అనిష్టమును చూపును. కేవలము అస్థిరమైన ఈ జీవన స్థితిని. ఇటనుండి వెడలి తీరవలయునను శుద్ధసత్యమును విస్మరించి ప్రపంచమునందలి మానవుడు తనకు సంబంధించని దానిని తనదిగా తలచుటలో పిచ్చివానివలె వర్తించుచున్నాడు. భ్రమాస్పదమైన నేను-నాది అను భావము వానిని సోదరమానవునితో ఒక చిన్న భూఖండము కొఱకును ఒక మిక్కిలి స్వల్పవిషయము కొఱకును పోరాటకు దించును. కొన్ని వేళల రక్తపాతము హత్యలు జరుగుట కలదు. ఇంతటికిని కారణము ఈ నేను-నాది అను భావమే. నాది అనుకొనుచున్నది ఇది వఱకు ఒకరిదిగా నుండెను, ముందు ఇంకొకరిది కాబోవును, అను నంశమును అతడు విచారించడు. విధివశమున అతనిని చేరి విధివశమున అతనిని వీడునది అతని దెట్లగును? నే డొకడు దరిద్రుడుగా నున్నాడు.

రే పతడు ధనికుడు కావచ్చును. ఎల్లుండి అతడే మరల దరిద్రు డగును. ఆ ధనము ఎచ్చటి కేగినది? దాని ఇచ్ఛప్రకారము అది వచ్చినది. దాని ఇచ్ఛ ప్రకారమే అది పోయినది. ఈ ధనము నాది అనుకొనుటలో హేతు వేమున్నది? అతనిదైనది ప్రతిదియు అతనిపై ఆధారపడి యుండ వలయును. కాని ఈ ధనము అతనిపై ఏమాత్రము ఆధారపడి లేదు. ఒకడు విద్వాంసుడై అన్ని అర్హతలు కలిగియు దరిద్రుడు. ఒకడు మూఢుడై ఎల్ల విధముల అనర్హుడయ్యును కోటీశ్వరుడు. కావుననే భీష్మా చార్యు డిట్లనెను— 'మానవుడు ధనమునకు దాసుడు గాని ధన మెవ్వరికిని దాస్యము చేయదు.' ఇట్టుండ మానవుడు 'ఈ ధనము నాది. ఇది నా ఆస్తి. దీనిపై నాకు యాజమాన్య మున్నది' అను భ్రమకు లో నగును. ఇది ఎంతటి వ్యామోహము!

ఈ వ్యామోహము ఈ నాటిది కాదు. తరతరములుగ తండ్రినుండి కుమారునకు, మరల తండ్రినుండి కుమారునకు ఈ రీతి సంక్రమించినది. పరంపరాగతమైన ఈ వ్యామోహమును పిత్రార్జితమునకు మనము గర్వింతుము. ఈ గర్వ మెంత తుచ్ఛమైనది! అది మనల నెంత నికృష్ట స్థితిలోనికి త్రోయుచున్నది! ఈ వ్యామోహపు పునాదులపైననే మన సాంఘికశాసనములు ధర్మములు నిర్మింపబడినవి. ఈ నేను-నాది అను భావముపైననే మన ఉన్నతనీతిసూత్రములు అమర్చబడినవి. 'ఒరులు నీ కేవి చేయవలయునని కోరుదువో వానిని వారియెడల చేయుము.' అనగా అందఱను నీవలెనే భావించుము అని అర్థము. ఇది నేను-నాది అను భావమును విశాల మొనర్చినది గాని భ్రాంతినుండి బయట పడవేయలేదు. అవ్యక్తమునుండి వచ్చిన నీవు అవ్యక్తమునకే పోవలసి యున్నది. ఈ గోళమునకు నీవు క్రొత్తవాడవు. నేడో రేపో నీవు క్రొత్తవానివలనే దీనిని వీడి పోవలయును. ఇది అలంకారికభాషాత్మకము కాని శుద్ధ సత్యము. అభ్యాగతుడు యజమాని ఆస్తిని నా దనుకొను అధికారమును

కలిగియుండునా? కావున వ్యామోహజాలమునుండి విడి వడ వలయు నన్న ఇచ్చట నున్న దేనినిగాని నీది అనుకొనుటకు నీకు అధికారము లేదు.

కోవిదులు మన కీ ఆప్తవాక్యమును చెప్పుదురు. చెప్పుట సులభము గాని ఆచరణయే కష్టము. ఈ విషయమందలి ఆచరణము మానవుని శక్తికి మించినది. త్రిభుజాకారములో నున్న వృత్తము నూహించుట ఎంత దుర్లభమో నేను-నాది అను భావము లేని ప్రపంచము నూహించుట అంత కష్టము. ఈ భావము చుట్టును ఈ లోకచక్రము తిరుగుచున్నది. చిన్న మొదలు పెద్ద వఱకును ఈ ఒక్క భావమును పూర్ణముగ నింపుకొని యున్నారు. కావున ఒక మానవుని ఇంకొక మానవుడు ఈ వ్యామోహము నుండి రక్షించజాలడు.

అటులైన ఇక ముక్తి లేదా? ఈ వ్యామోహము లేక మాయ అను రాక్షసియొక్క జయింపరాని హస్తముల జిక్కి ఆటవస్తువువలె శాశ్వతముగ ఆడింపబడవలసినదేనా? ప్రపంచమునందలి సామాన్యమానవజాతి కంటె విలక్షణులైన అట్టి కొలది మందిని మాత్రమే మనకు చరిత్ర చూపును. మానవులైన దేశికుల ఉపదేశములతో వారి కే నాడును సంతృప్తి జనించదు. మానవుని ఈ వాంఛలు ఈ తృప్తి అతనికి సంతుష్టిని కూర్చవు. కామము ధనము వాని నాకర్షించవు. ప్రకృతి దాని సౌందర్యమంతటితో వారిని మోహితుల జేయలేదు. నాది-నేను అను భావమునకు వారిలో తావులేదు. వారి చుట్టును గల మానవానీకము అనుసరించుచున్న మార్గమును అనుసరించుటకు వారికి ఇచ్ఛ లేదు. వారి మానసికతృష్ణ క్షుధ ఈ ప్రాపంచికమైన అన్నపానముల శాంతించదు. కావున వారిలో ప్రతి ఒక్కరును ఒక ప్రత్యేకమైన బాటను ఇదివఱ కెవ్వరును ఊహించని దానిని తమకొఱకును తమ ననుసరించువారికొఱకును నిర్మింతురు. నడచుచున్న మతవిధానములో విద్యాపద్ధతిలో వారికి దోషములు కనబడును. గర్విష్ఠుల గర్వమును అణచుటకు చూతురు. సంఘ

పథమును మార్ప యత్నింతురు. తోచినచో పునర్నిర్మాణ మారంభింతురు. జను లట్టివానిం గాంచి 'ఇత డెట్టివాడై యుండవలయును' అని వింతతో నడుగుదురు. అతనికి మానవు డెప్పుడును గురువు కాడు. మఱి తన విశిష్టవిద్య నెక్కడ అభ్యసించును? అవ్యక్తుడైన ఆ గురు వెవ్వరో? లేక తననుండియే తాను నేర్చుకొనునో? తనకు తానే గురువు. అతని దెంత అమోఘశక్తి! తన నవ్యసిద్ధాంతములను సూత్రములను అడ్డగించుటకు దండెత్తిన మానవజాతి శక్తి నంతటిని ఒక్కుమ్మడి వమ్ము చేయును. వానిని తమలో నొకడుగ వా రెట్లు జమకట్టగలరు? అట్టి మానవు డగుటకు వానిలో మహోత్తమమైన మహోన్నతమైన మహోత్కృష్టమైన దేదో కొంత కలిగియుండవలయును.

ఈ రీతి సహజముగనే ప్రజ లందఱు వానిని మానవాతీతుడని దివ్యుడని భావించి చివరకు తామే వానికి 'భగవదవతారపురుషుడు' అను బిరుదము నిత్తురు. వాని అభివృద్ధి విద్య ఈ ఇంద్రియసాధనముల సాధింపబడక అతీంద్రియధామమునుండి సమాగతము లగును. కావున అతనివి అతీంద్రియానుభవములు. మన కవి వింతలుగను ఆశ్చర్యకరములుగను అవిశ్వసనీయములుగను తోచును. అయినను మనము కాదన లేకుందుము. గ్రంథములనుండి శాస్త్రీయముగ గొన్న విజ్ఞానము కాక నూతనభావములను సిద్ధాంతములను అతడు ప్రతిపాదించి మనచేత విశ్వసింపజేయును. శరీరమే తా ననుకొని, అంతకంటె ఉన్నతముగ తనను భావించుకొనినచో, ఆకర్షించుచు తన ప్రక్క నుండి తన నావేశించి యున్న భార్య యను సుందరమైన దేవతయొక్క సాన్నిధ్యము దూరమగునేమో యని భయపడు వ్యక్తి కూపస్థమండూకమువలె ఈ అయిదు ఇంద్రియములకు అందునట్టి విషయములకంటె వేఱుగా ఉన్నతమైనది ఉత్తమమైనది లేదని తిరస్కరించవచ్చును. తన కిష్టమైన ఈ అభిప్రాయమునకు అనుగుణముగా వ్రాయబడిన వ్రాతలను ప్రమాణములుగా చూప

వచ్చును. ఈ నేల నాలుగు మూలలకు మాత్రమే అవి బంధింపబడి యుండును. కాని వివేచన మున్న ఏ మానవుడును పంచేంద్రియముల కందునట్టి ఈ భూగోళము కాక అనేకగోళములు కలవను భావమును హేతువాదమున తిరస్కరింపజాలడు. నిజమైన మానవుడు మనము పరిశీలించినట్లు సచ్చిదానందమూర్తి యగుచో శరీరభ్రాంతితో నున్న ఈ మానవుని సంకుచితభావమును మనము త్రోసివేయవచ్చును. నవ్య నాగరుడు గోపురము లెక్కి గోలపెట్టి సంశయాత్మకములైన తన సిద్ధాంతముల నెంత గ్రుద్దిచెప్పినను లాభము లేదు.

అనాదికాలము నుండి ఈ మన పృథివిపై కారుణ్యము వహించి అవతరించిన ఇట్టి దివ్యపురుషుల సంఖ్య చాల తక్కువ. వారిని వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. వా రేల వత్తురు? మనకు నూతనమైన దేదో చెప్పుటకును, అంతకు పూర్వ మున్న తాత్త్విక ఆధ్యాత్మిక సంపదను వేయి మడుంగులు పెంపుచేయుటకును. అట్లు చేసి వా రేగుదురు. పూర్వకాలమున తత్త్వవిషయము కొలది మందికే తెలిసిన వేళ బుద్ధుడు లోని నిజతత్త్వమును కొంతవఱకు ప్రజలకు విచ్చలవిడిగా బోధించి సకారణముగా తన సిద్ధాంతములను నమ్మింపజేసి తనవైపునకు చాలమందిని లాగుకొనెను. పిదప బాహ్యమునే నమ్మి అంతస్సును విస్మరించి ప్రజ లున్నవేళ ఏసుక్రీస్తు ప్రభవించి దివ్యసందేశము నందించి తన ఉద్యమమునకే ప్రాణ మర్పించెను. తరువాత, ఒకప్పుడు ఉన్నతవైభవమున వెలుగొందిన బౌద్ధముయొక్క అనుయాయులు అధఃపతితులై దుర్వృత్తుల దవిలి యున్న వేళ శంకరు డుద్భవించి వారి సేతలను ఖండించి బుద్ధుని అవతారముగా అంగీకరించి సంఘముయొక్క స్థితిని ఉత్తమముగ నొనర్చి సత్యవిషయములకు పునఃప్రతిష్ఠ చేసెను. ఆపైన శంకరానుయాయుల నిర్జీవవృత్తములను గమనించి కొంత బాగు చేయుటకు రామానుజుడు వచ్చి ఒక నూతనరీతి మతమును ప్రసాదించెను. అనంత

రము సర్వజనులు తరించుటకు యోగ్యమైన మార్గమును చూపుటకు మధ్వాచార్యులు వచ్చెను. ఆ తర్వాత శ్రీ గౌరాంగుడు తన మధురభక్తిని వెదజల్లెను. అతిసుందరము అత్యున్నతము అయిన శ్రీకృష్ణుని జీవితములోని మానుషము అతిమానుషము అయిన స్వభావము నన్నివైపుల నుండి దర్శించి ఆ దివ్యాగారమును ప్రవేశించుటకు ద్వారము తెఱచెను. బుద్ధభగవానునికి పూర్వము ఎన్నో శతాబ్దముల క్రిందట దివ్యసుందర మూర్తి శ్రీకృష్ణుడవతరించి ఈ పృథివిని పవిత్రము నొనర్చి సర్వమతముల నధఃకరించుచు విశాలభావములతో కూడినదియు సర్వకాలములకు సర్వమానవులకు సరిపడునదియు సత్యజ్ఞానానందమైనదియు నగు తన దివ్యసందేశమును ప్రసాదించెను. గౌరాంగునిలో పరస్పరవిరుద్ధములుగా కన్పట్టు లక్షణముల సమన్వయము కుదుర్చుకొనుట కొందఱకు కష్టము. వానిలో పూర్వావతారముల ఉత్తమాంశములు మేళనము పొంది పునర్వికాసము నందినవి.

ఈ పై జెప్పిన దానిని బట్టి నామరూపముల దాటినట్టియు, మనో నిర్దిష్టములైన ఇంద్రియములు చూపు మార్గముల నతిక్రమించినట్టియు, ఈ అవతారపురుషులు అప్రాకృతికానుభూతి కలవారనియు, అతిలోక జ్ఞానశక్తులు కలవారనియు, విశదమగుచున్నది. అందువలన శరీరములచే బంధింపబడక దేశకాలములచే సంకుచితము చేయబడక వారు సర్వకాలముల సర్వదేశముల వ్యాపించు సవాగతు లనునది రూఢము. వారి జీవితముల ఆద్యంతములు లేవు. కారణము, పరిమితమైన కొంత కాలముండి పోవు శరీరములతో తాదాత్మ్యమును వారు పొందరు. శాశ్వతముగ నుండువారు కావున ఇప్పుడును ఉన్నవారే.

కాని, ఒక ప్రశ్న రావచ్చును. అటులనే ప్రతిమానవుడును శాశ్వతుడు కాడా? వీరి ప్రత్యేకత ఏమి?. వారి కున్న ప్రత్యేకత ఇది-వారి శాశ్వతత్వమును వారు ఎఱుగుదురు. ప్రపంచమానవు డట్టివాడే అయి

నను ఆ విషయ మెఱుగడు. కావున భేద మపారము. ఒకడు జ్ఞాని, ఇంకొకడు అజ్ఞాని; ఒకటి వెలుగు, ఇంకొకటి చీకటి; ఒకడు మార్గము తీయును, ఒకడు అనుసరించవలెను. ఏలనన, ఒకనికి కన్ను లున్నవి, ఇంకొకడు గ్రుడ్డివాడు.

అతిసంకుచితమైన ఈ మనస్సునే విశ్వసించుచు గర్వమును నింపుకొన్న ప్రపంచమానవుడు చేయున వన్నియు తప్పులే అగుట సహజమే. ఈ అవతారపురుషులం దొకరినైనను అనుసరించకుండునా, దుఃఖభూయిష్ఠమైన ఈ లోకపు చిక్కుత్రోవలలో విషాదమును పొందక తప్పదు. ఈ బాటలందు ప్రకృతి మోహినియై పాంథులను మోసగించి తుదకు వినాశమునే కూర్చును. వైభవమూర్తులయిన వా రందఱి జీవిత ములను ప్రపంచము హృదయపూర్వకముగా తనంతనే వినుతించి వా రవతారపురుషులని భావించును. ఏల? మానుషములు అతిమానుషములు అయిన వారి కృత్యము లోకమేళనము నొంది ఎల్లప్పుడును దానిముందు గోచరించును. తమ వివేకమునే గొప్పగా చెప్పుకొను భావశూన్యులు ఈ అతిమానుషకృత్యములు ఆ మహాపురుషుల అనుయాయులచే పిదప కల్పింపబడినవని వాకొందురు. అతిమానుష మయినది లేదని వారి భావము. ఇదంతయు చూడ, కూపస్థమండూకము ఆ కూపమున కంటె ఇక లోకము వేఱుగా లేదని వాదించిన ఎట్లుండునో, వారి వాదము అట్టిది కాదా? నిజముగా అట్టి వారిని జూచి జాలిపడవలయును. మానవ సంబంధమును దాటిన ఊహను పొందుటకు వా రిచ్ఛగించరు. తక్కువ శ్రమతో ఎక్కువ లాభమును పొందుట, ఈ లోకసుఖము నెక్కువగా ననుభవించుట—వీనిని బోధించుచు, తమవలెనే కష్టసుఖానుభూతులు కల ఒరవడిమానిసిలో కనబడు దానికంటె విశేషమును ఈ అవతారపురుషు లలో వారు చూడగోరరు. తమ చుట్టును గల మానవుల జీవితము లెంత వ్యతిరేకముగా నున్నదియు గమనించరు. ఈ చుట్టును గలవారి

సంఘములో నున్న పద్ధతులలోని నమ్మకములలోని దోషముల నన్నిటిని ఎత్తి చూపు ఆ మూర్తుల శక్తి సహజమైనదనియు కాక అవ్యక్తమైన దనియు ఈ సంఘమునుండి గ్రహించినది కాదనియు వారు గ్రహించరు. గ్రహించినను విస్మరింతురు. దుడుకుతనము గల ఈ మానవులు, అవ తారపురుషులు త్రోవ చూపుటకు వచ్చిరనియు, ప్రజలు నడచెడి త్రోవల నడచుటకు రాలేదనియు స్మృతియం దుంచుకొనరు. మార్గదర్శకులు గనుకనే వారి కృత్యములు అతిమానుషములు అద్భుతావహములుగ కన్పట్టును. అట్టి మహాపురుషుల జీవితములను సామాన్యమానవుల జీవితములకంటె గొప్పవి కావని చెప్పువారి యత్నము లెట్టివి? సూర్యుని వెలుగులేక చిత్రించుటవంటివి. ఆకృతి లేక సౌందర్యమును చూపుట, నాదము లేక గానమును వినుట, రుచిలేక విందు గుడుచుట ఇట్టివి. సూర్యునినుండి వెలుగు నెట్లు వేఱు చేయుటకు వీలులేదో అట్లే అతి మానుషశక్తిలేక అవతారపురుషు డుండడు. కావున అతిమానుషశక్తు లను పూర్ణముగ విశ్వసింపజాలమని వారి జీవితములందలి వింతపనులను విడనాడినచో మన వివేకమును గూర్చి సూరివరులు శంకింతురు. అందు వలన ఈ అవతారపురుషుల జీవితములను ప్రదర్శించునపుడు మన గ్రంథములలో దృష్టమైనట్లే చెప్పుట మనకు ధర్మముగాని కొంత విడిచి కొంత మార్చి కొంత వక్ర మొనర్చి మూలమునకు విరుద్ధము చేసి మన సంకుచితాభిప్రాయములకు అనువగునట్లు చెప్పరాదు. ఈ ఉపోద్ఘాతముతో కథాంశమును ప్రవేశింతము. దివ్యాంశసంభూతుడైన శ్రీకృష్ణుడు జగత్తు యొక్క భౌతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అవతరించిన వాడగుట వలన ఆ కథ మనకు నిజముగ లాభమును గూర్చును.

బృందావనమునుండి రామకృష్ణులను తీసికొని రమ్మని అక్రూరుని అటు పంపినది మొదలు ఇట నంతఃపురమున కంసునకు విశ్రాంతి లేదు, నిద్ర లేదు. ఒక వేదనతో కూడిన ఆవేగము అతనిలో జ్వలించి

వారి రాకను అనుక్షణము నిరీక్షించుచుండెను. నగరవాసులు రానున్న ఉత్సవమునకు ఎదురు చూచుచు సంతోషమున నుండిరి. సుందరాలంకార శోభితులై సుఖసంతోషహాసముల భాషించుకొనుచుండిరి. మధురానగరము నగరమే ఆ జగద్రత్నయుగళమును తన యెదపై ధరించుటకు ఎదురు చూచుచు స్వాగత మీయుటకు సంసిద్ధయై మోదమున పొంగి వేచి యుండెను. వారి అనుపమానమైన ఆకృతిసౌందర్యము అమోఘశౌర్యము అన్నిదిక్కుల ప్రవాదమారుతముల నటకు చాలకాలమునుండి చేర్చుచునే యుండెను. కావున రామకృష్ణులు మధురావాసులకు అపరిచితులు కారు. వారు తమంతనే గృహములను వీధులను రమణీయముగ అలంకరించి చిరకాలవాంఛితమైన ఆ దివ్యసోదరుల ఆగమనమునకు ఘనస్వాగత మీయ సంసిద్ధులై గడియలు లెక్కించుకొనుచుండిరి. కంసునకు విశ్రాంతి లేదు. కాని వాని హృదయముయొక్క స్థితి పౌరహృదయస్థితికంటె విభిన్నమైనది.

ఒక వైపున ప్రాణములతో నా సోదరద్వయమును విడిచిపుచ్చకుండు రహస్యాజ్ఞలతో ప్రచండులును రక్తపిపాస కలవారును భయంకరాకారులును అయిన మల్లయుద్ధవిశారదులతోడను మదోన్మత్తమాతంగములతోడను కూడిన రంగస్థల మలంకరింపబడుచుండెను. మఱియొక వైపున పరమ భక్తితోడను ప్రవిమలప్రేమతోడను వారిని ఆహ్వానించుటకు నగర వాసులచే పురము మనోహరముగ అలంకరింపబడుచుండెను. ఒకడు మహాబాధతో విశ్రాంతి నెఱుగడు. మఱి కొందరు చిరనిరీక్షితసుఖ సందర్శనసమాగమస్మృతితో విశ్రాంతి నెఱుగరు. ఈ ద్వివిధవిరుద్ధ ప్రవృత్తులును విశ్వద్రష్టలగు నా సోదరుల మనోనేత్రముల బారికి చాటు కాలేదు. వారు రెంటికిని సన్నద్ధు లయియే యుండిరి.

అక్రూరుడు శ్రీకృష్ణుని ప్రభావము నెఱుంగని వాడు కాడు. గొప్ప కృష్ణభక్తు డతడు. కంసునికి నమ్మినబంటు. అయినను ఆ సోదరులకు

కంసుని ఆహ్వానములోని ఆశయమును విశదము చేసెను. రామకృష్ణులు యమునాజలముల తమ స్నానములు ముగించి వచ్చి రథమునం దాసీను లైరి. పిదప అక్రూరుడు స్నానార్థము యమునలో దిగెను. ఒకసారి మునిగి నాడు. నీటిలో రామకృష్ణుల దివ్యరూపములు దృగ్గోచరము లయ్యెను. క్షణము క్రింద రథమం దున్నవారు నీటిలోని కెట్లు వచ్చిరని విభ్రాంతితో లేచి తల యెత్తి రథమువంక చూచెను. వారచట పూర్వమువలెనే సుఖా సీనులై యుండిరి. తన దృష్టిలో లోప మున్న దనుకొని మరల మునిగి చూచెను. ఇప్పుడును నీటిలో స్పష్టముగ కనుబడుచుండిరి. తిరిగి అతడు తల యెత్తి రథము దిక్కు చూచెను. మార్పేమియు లేక పూర్వమువలెనే వారు రథమం దుండిరి. అతడు మూడవసారి మునిగెను. మరల కనబడిరి. తిరిగి తల యెత్తెను. రథమం దుండిరి. ఇట్లనేకపర్యాయములు మునిగి చూచుటలు లేచి చూచుటలు జరిగినను ఆ రహస్యము వానికి విశదము కాలేదు. తుదకు వారు సర్వేశ్వరుని అవతారమూర్తులని నిశ్చయించుకొని భక్తియుక్తుడై పారవశ్యమున వారి ప్రభావమును కీర్తింపసాగెను. 'సర్వమును ఉదరమున ధరించిన ఓ స్వామీ! వినయముగ నమ్రుడనై నీకు నమస్సు లర్పించుచున్నాను. ఈ విశ్వము నీనుండి ఉత్పన్నమైనది. అన్నింటికిని ముందే నీ వుంటివి. శాశ్వతుడవు. నీ నాభికమలమునుండి బ్రహ్మ జనించి ఈ జగమును సృజించెను. నా ప్రణామము లందు కొనుము.'

కావున రామకృష్ణులు మానవాకృతులు ధరించిన పరమాత్మయొక్క అవతారము లనియు ప్రకృతిసౌందర్యమునకు మోహితులగు స్త్రీపురుషు లను మఱియు మోహింపజేసి తనవైపు లాగికొనుటకు దివ్యసౌందర్యవిభ్రా జితములయిన మనోహరాకారములను ధరించిన వారనియు అక్రూరునకు తెలిసెను. మనము కూడ శాశ్వతులమే. కాని మన కా భావము పూర్ణముగ అజ్ఞాతము. నామరూపముల దాటి పోనీయని అజ్ఞానము యొక్క

శక్తికి వశులమై మన మున్నాము. భగవత్ప్రభావజ్ఞానజ్యోతి యొక్క వెలుగులో అజ్ఞానాంధకారము విచ్ఛిన్నమై పారిపోవును. కొయ్యలో స్వతస్సిద్ధముగ నిప్పు ఉన్నను చలిని పోగొట్టుటకు కొయ్య ఏ మాత్ర మును ఉపయోగించదు. కావున కొయ్యనుండి బహిర్గతమైన అగ్నియే మనకు బహువిధముల ఉపకరించును. అటులనే బహిరాగతాగ్నులవంటి రామకృష్ణులు మనలను ఈ దుర్గమజగదరణ్యతమోమార్గములయందు వెలుగులై వెలికి చేర్చగలరు. తమ శరీరములందు నిబద్ధులు కారు. కావున సర్వజనుల మనస్సులను ప్రకాశింపజేయగలరు. అక్రూరుని మనస్సు ప్రకాశము నందినది. కనుకనే అత డాయువకులలో భగవ దంశమును దర్శించగలిగెను. అటులనే కంసుని మనస్సును సైతము వారు ప్రకాశింపజేయలేరా? వాని క్రౌర్యమునుండి బాధపడుచున్న జగత్తును రక్షించుటకు వానిని సంహరించుట తప్ప మఱొండు మార్గము లేదా? అక్రూరునిపై పక్షపాతము వహించుట కాదా ఇది? అని మన మనరాదు. సూర్యుని ప్రకాశము ఎల్ల లోకమున ప్రసరించును. ఒకడు దుర్మార్గుడని వానిపై ప్రసరింపకుండుటయు, ఒకడు భక్తుడని వానిపై ఎక్కువగా ప్రసరించుటయును లేదు. సువాసనగల చక్కని పూవుపైనను దుర్వాసనగల మురికిగుంటపైనను వికసించినవానియందును ముకుళించిన వానియందును అంతటను ఆ కాంతి ప్రసరించును. కాని వికసించినవి గ్రహించి మెఱయగలవు. అందుచే సూర్యుని పక్షపాతి యనలేము. అటులనే రామకృష్ణులను పక్షపాతబుద్ధి కలవా రనలేము. కంసుడు క్రూరుడు. వృద్ధుడైన తన తండ్రినే అతడు చెఱసాలయందు త్రోసి సింహాసనము నధిష్ఠించెను. దొంగతనము అంకుతనము ఓర్వలేని తనము ఇటువంటి చెడ్డ గుణము లన్నియు కలిసి అతనిలో రూపు గొన్నవి. ఎవడైన సజ్జనుడు ధైర్యముచేసి అతని బాట కడ్డము వచ్చెనా అతనిని నాశనము చేయుటకు వెనుదీసెడివాడు కాడు. సజ్జను లందఱు అతని

వారినుండి కొందఱు పలాయితులై పోగా మిగిలినవారు సంహతులైరి. సన్నిహితులు ఆప్తులు అయిన బంధువులలో సజ్జనులు దైవభక్తులు అయినవారి నీతడు తిరస్కరించెను బాధించెను. వారతని బాధను పడలేక దూరమున వసించిరి. ఇట్టి క్రూరుని రాక్షసుని ధాటికి తట్టుకొని జనులు నిలువగలరా? బ్రతుక గలరా? మంచి గుణములు లేని ఈతని దుర్మార్గము నుండి లోకమును రక్షింపవలయు నన్న కలుపు మొక్కను పీకి వేయునట్లు వానిని సంహరించుటయే విధి. అప్పుడే సత్ఫలములు లభించును. కుమారుని దండించని తండ్రి తన ధర్మమును నిర్వర్తించిన వాడు కాడు. నేరము చేసిన వారిని దండించక విడచిన ప్రభుత్వము ప్రభుత్వము కాదు. శిక్షింపబడని దుర్మార్గులు సంఘమును అచిరకాలములో మ్రింగి వేయగలరు. కావున క్రూరుల చేతలనుండి తన బిడ్డలను రక్షించుటకు భగవానుడు అప్పుడప్పుడు అవతరించుచుండవలయును. దుష్టులను సంహరించవలయును. శిష్టులను రక్షించవలయును. అట్టి అవతార పురుషులు రానిచో ఈ ప్రపంచ మెప్పుడో నశించి యుండెడిది. కనుకనే అవసరమును గుర్తించి అవతారపురుషుడు ఉదయించును. అట్లు కావుననే భగవానుడు చేసిన ఈ సృష్టి నిలుచుచున్నది. తాను చేసిన ఈ సృష్టిని భగవానుడు నిలుపుకొనును. ఏ తండ్రియు తన ముద్దుబిడ్డడు తన యెదుట ఒక దుర్మార్గునిచే హింసింపబడుట సహించడు. తన బిడ్డని రక్షించుకొనని వాడు తండ్రికాడు. భగవానుడు తన సృష్టివినాశమును కోరడు. రామకృష్ణులు భగవానుని అవతారములు కావున సజ్జనులను రక్షించుటయు, దుష్టులను చీల్చి చెండాడుటయు, వారి విధ్యుక్తధర్మము. రామకృష్ణులు భూమిపై నున్నంత కాలము ఈ సృష్టిమహోద్యానమున పడి మొలిచిన చెడు మొక్కలను ప్రత్యక్షముగనో పరోక్షముగనో పెఱికివేయు పనియందే నిమగ్నులై యుండిరి.

అక్రూరునితో గూడి యమునను దాటి మధురానగరము చేరు నప్పటికి ఆ గోపబాలకుల హృదయములనుండి బృందావనలీలావిహారముల

స్మృతి పూర్ణముగ తుడిచివేయబడినది. ఆర్తుల దైన్యము వారి హృదయముల నావరించినది. ఆర్తరక్షణమునందు వారి భావములు హృదయములు శక్తులు కేంద్రీకరింపబడినవి. వారు పూర్ణముగ మాఱిపోయిరి. తమ చుట్టును చూచిరి. నగరవాసుల వస్త్రాలంకరణములకును తమ వానికిని సామ్యము లేకుండెను. మార్చుకొనదలచిరి. నగరమున రాజవస్త్రనిర్మాత మందిర మగపడినది. రాజకుటుంబమువారి కనువైనట్లు మనోహరముగ తయారుచేయబడిన దుస్తులు ఎదుట కన్పట్టినవి. అచటికేగిరి. ఆ దుస్తులలో తమకు సరిపడునవి ఇమ్మని వాని నడిగిరి. ఇట్లా రాజపుత్రముల నింకొకరడుగుట వానికపచారముగ తోచినది. వారి నిర్లక్ష్యభావము అహంకృతి అతనికి రాజద్రోహముగ తోచెను. తన గౌరవము భంగింపబడినట్లు తలచెను. వారి నవమానించుటకు రక్షకభటుల రప్పింప జూచెను. ఈ సన్నాహమును వారు గుర్తించిరి. సింహకిశోరములు మేకపిల్లలను వలె అతనిని అతనికి తోడైన వారిని మట్టగించి చావమోది ఆ కనబడుచున్న వానిలో తమ కనువైన దుస్తుల స్వీకరించిరి. రాముడు నీలాంబరధరుడయ్యెను. కృష్ణుడు పీతాంబరధారియయ్యెను. ఒక మఱుగుజ్జు వనిత చిత్రవిచిత్రములుగ అల్లబడినట్టియు, సువాసనలు గ్రక్కుచున్నట్టియు సుమదామములను సుగంధలేపనమును కొంపోవుచుండెను. అవి రాజగృహమువారి కుద్దేశింపబడినవి. తమనా దండలతో అలంకరింపుమని వారామె నడిగిరి. వారి సౌందర్యమునకు ముగ్ధయై వికారాకారయయ్యు కరుణాత్మ యగు నామె తనయొద్ద గల చక్కని పూదండలతో రామకృష్ణుల నలంకరించి సుగంధమును శరీరము నిండ బూసెను. మధురానగరమున జరుగ నున్న మహోత్సవమును దర్శించ నెంచి అమరలోకమునుండి అవతరించి వచ్చిన దేవతలవలె ఆ సుందరమూర్తులు మిగుల సుందరముగ వెలుగొందిరి. ఆమె సౌజన్యమునకు ప్రతిఫలముగ కృష్ణస్పర్శచే ఆమె వికారాకారము దివ్యసుందరాకారముగ మాఱిపోయెను.

తన విధ్యుక్తము నిర్వర్తించవలసిన సేవకుని తన కోర్కెను తీర్చలేదని సంహరించుటయు, తన విధి నతిక్రమించిన పరిచారికను తా నడిగినట్లు చేసిన దని అనుగ్రహించుటయు శ్రీకృష్ణుని పక్షపాతబుద్ధికి ఉదాహరణములు కావా? ప్రతి మానవు డాచరించవలసిన ఉత్తమధర్మ మేమన—సద్గుణము భక్తి ఎచ్చట కన్పట్టినను ప్రేమించుట: ప్రతిమానవుడు చేయగల మహా పాతక మేమన—అధర్మము నాస్తికభావము అమానుష కృత్యము వీనికి ప్రోద్బలము చేయుట. దుర్మార్గము మూర్తిగొన్న వాడు కంసుడు. అతని నెవడు ప్రేమించినను గౌరవించినను దౌష్ట్యమును ప్రేమించినవాడు గౌరవించిన వాడు అని అర్థము. అందుచేత అతడు దుష్టుడైన కంసుని ఫలమును పంచుకొనవలయును. నగరమున నీచబుద్ధి గల ఏ కొలది మందికో తప్ప ఎల్లరకు ఆ రాక్షసునిపై ప్రేమ లేదు, గౌరవము లేదు. వా రందఱు ఆ కఠినుని కర్కశహస్తములనుండి తప్పింపు మని దేవుని ప్రార్థించుచుండిరి. వారి ప్రార్థన లంగీకరించి భగవానుడు శ్రీకృష్ణరూపమున రావలసివచ్చెను. కంసుని ఆ పరిచారికయు సహజసౌజన్యము కలది. కంసునికి ఆమె హృదయాంతరాళమున గౌరవము లేదు. భీకరు డగుటచే భయమువలన వానియెడ వినయముతో బాహ్యమునకు వర్తించవలసివచ్చెను. ఆమె సౌజన్యమునకు తగిన ఫలమును శ్రీకృష్ణు డనుగ్రహించినాడు.

అట్లు రమణీయాంబరములు కట్టి కమనీయకుసుమదామములు ధరించి ఆ సోదరులు నగరమందలి స్త్రీపురుషు లందఱి హృదయములను ఆకర్షించిరి. వారి నేత్రములు ఆ మూర్తులను జూచుచు తొలగుట లేదు. రంగద్వారమును రామకృష్ణులు ప్రవేశించిరి. కంసభటులు వారిని చూచుట తోడనే తమ ప్రభు నాజ్ఞ ప్రకారము కువలయాపీడమను మత్తగజమును వారిపైకి తోలిరి. అచిరకాలమున వారు దాని బరిమార్చిరి. ఇంతలో చాణూరముష్టికులను ఇరువురు మల్లులు వారిని సంహరించు నుద్దేశమున

వచ్చి కలియబడిరి. కాని, వారి దుర్భావములు వారి మదము నడచెను. రామకృష్ణులు ఆ మల్లులను ఓడించుటయే కాక వారిని గతప్రాణుల జేసిరి. ఇది చూచిన కంసుని కోపము మిన్ను ముట్టెను. 'నందుని కారాగృహమున బెట్టుడు. వసుదేవుని చంపుడు. ఈ దుష్టసోదరద్వయమును నగరము నుండి వెడలగొట్టుడు.' అని భటుల కాజ్ఞ యిచ్చెను. కాని, అంతవఱకు శ్రీకృష్ణు డాగలేదు. వెంటనే సింహాసనము పై కుఱికి కేశములు పట్టి క్రిందికి లాగి కొనివచ్చి పడవైచి క్షణకాలమున ఘన ముష్టిఘాతముల వానిని నిర్జీవుని జేసెను. కంసపక్షమువారు కొందఱు రామకృష్ణుల నెదుర్కొన వచ్చిరి. వారలకును కంసుని గతియే పట్టినది పిమ్మట రామకృష్ణులు విజయవైభవమున తమ తండ్రియైన వసుదేవుని దర్శించిరి. తండ్రికి బాలకుడు, క్రూరులకు భీకరుడు, జ్ఞానులకు సచ్చిదానందస్వభావుడు, సజ్జనులకు విశ్వేశ్వరుడు, సాటివారైన వృష్ణివంశజులకు సుఖముల నిచ్చు చల్లని దేవుడు. ఇట్లు జగదేకనాథు డా శ్రీకృష్ణు డెల్లరకు గోచరించెను. క్రూరుడైన కంసునియొక్కయు కంసపరివారముయొక్కయు సంహారము ముగిసినది. అచిరకాలమున శాంతి నెలకొనినది. ఎల్లరు సంతోషించిరి. శ్రీకృష్ణు డప్పుడు తల్లిదండ్రులయిన దేవకీవసుదేవులను కంసుని తండ్రి యైన ఉగ్రసేనుని కారాగారముల నుండి విముక్తుల గావించెను. ఉగ్రసేనుని సింహాసనమున గూర్చుండబెట్టెను. రాజ్యభోగములం దాసక్తి లేని వా డా వృద్ధుడు. ఏ కోర్కెలును లేనివాడు. పిదప తన తల్లిదండ్రులయిన దేవకీవసుదేవులకు నమస్కరించెను. మొదట వారు తమ పుత్రద్వయమును గుర్తించలేకపోయిరి. అప్పుడు కృష్ణుడు తా మెరువ రెవ్వ రయినది చెప్పెను. వారి సంతోషమునకు మేర లేకపోయెను. పారవశ్యమున ఒడలు మఱచిరి. స్వస్థచిత్తులై పుత్రులను కౌగలించుకొని కన్నీట దడిపిరి. కంసుని క్రౌర్యకథలు చెప్పి వాని సంహారము తమ పుత్రులచే జరిగినట్లు విని సంతసించిరి. విపత్తు లన్నియు ఒక్క పెట్టున తొలగినవి. మిగిలిన కాలమును వారు తమ బిడ్డలతో వసించుచు గడపిరి.

అప్పు డొక విషాదఘట్ట మారంభమైనది. యశోదానందులు తమ బిడ్డలను దేవకీవసుదేవులు తమ బిడ్డలని గ్రహించుటతో దుఃఖమగ్ను లయిరి. గోపికాగోపకులు శ్రీకృష్ణు డిక బృందావనమునకు రాడని తెలిసికొనుట తోడనే పిడుగు పడినట్లు కుప్ప గూలిరి. రామకృష్ణులను విడిచి గోకులమునకు పోవుట వారికి విశ్వసింపరాన ట్లయ్యెను. వృద్ధులును, దుఃఖబాధతో కృశించి యున్నవారును అయిన జననీజనకులగు దేవకీవసుదేవులను విడిచి రాజాలనని, శ్రీకృష్ణు డుత్సవవేళ రాజునకు కానుక లర్పింప వచ్చిన యశోదానందులకును, తక్కుంగల గోపికాగోపకులకును, చెలికాండ్రకును, గొల్లపడుచులకును, చెప్పిన తోడనే వారు ప్రాణములు పోయిన ట్లయిరి. వారిపై పిడుగు పడిన ట్లయ్యెను. ఏమి చేయుటకును వారికి తోచలేదు. రామకృష్ణులపై వారి ప్రేమ పార మెఱుగనిది. కృష్ణుడు వారి ననేకవిధముల ఓదార్చెను. త్వరలో రాగలనని చెప్పెను. అనేకసంవత్సరములు చెఱసాలలో నుండి ఆ క్రూరుడు పెట్టిన యిక్కట్లకు కన్నులు వాచి పోవ నేడ్చి యేడ్చి గ్రుడ్డివడి యున్న తల్లిదండ్రులను సుఖపెట్టుట పుత్రుని ధర్మము కాదా యని మెల్లగా వారికి చెప్పెను. కంసుడు కూర్చిన దుఃఖాబ్ధిలో మునిగిన తల్లిదండ్రులను వలచక బృందాగోకులములు దాను సుఖజీవితము గడపుట ఎంత అపచారమో విచారించు డని తన స్థితిని వారికి నివేదించెను. ఇట్లు చెప్పి తల్లిదండ్రుల విడిచి రాలే నని కృష్ణుడు స్పష్టము చేసెను. రమ్మనిన యశోదానందులకు నిషేధవాక్యము లిట్లు పలికిన కృష్ణుని ప్రత్యుత్తరము లాశ్చర్యమును కలిగించినవి. గొల్లలు కన్నీరు వర్షించిరి. కృష్ణుడు యశోదానందుల పాదములకు నమస్కారములు చేసెను. స్నేహితులను కౌగలించుకొనెను. అందఱును శాంతిసౌజన్యప్రేమ వాక్యముల సమాధానపఱచి త్వరలో గోకులమునకు రాగలనని చెప్పి పంపెను. దుఃఖమున క్రమ్మగ్గుచు కృష్ణుని వైపునుండి దృష్టులను మఱలించు

కొనలేక పోలేక పోలేక గోపీగోపకులు గోకులమునకు పోయిరి. విదేశమున కేగినట్లు వా రేగిరి. ఈ ఘట్టమును వైష్ణవకవులు మహా కరుణముగ చిత్రించిరి. ఆ వర్ణనము చదివిన అయఃపిండములవంటి హృదయము లైనను కరగును.

యశోదానందాదిగోపీగోపసమూహమును యమున దాట బంపి రామకృష్ణులు తిరిగి దేవకీవసుదేవుల పాలికి వచ్చిరి. కొన్ని నెలలు వారి మనస్సులకు సంతోషమును గూర్చుచు పరిచర్య లొనర్చిరి. కాని అప్పటివఱకును విద్యాగంధములేని జీవితములు గడపితిమని పండితుల చెంత సిగ్గుపడిరి. అందుచే కాశీనగరమున సాందీపముని చెంత విద్యాభ్యాస మొనర్చుటకు పోదలచి తల్లిదండ్రుల అనుజ్ఞ వేడిరి. ఇష్టము లేకున్నను పుత్రయశస్కాములై వా రంగీకరింపక తప్పినది కాదు. అట్లాజ్ఞ గొని వారు సాందీపముని చెంత కేగ, ఆయన సంతోషముతో వారిని శిష్యులనుగ స్వీకరించెను. రామకృష్ణులు ఇతరవటువులతో కూడి గురుసేవ చేసిరి. భయభక్తుల జూపిరి. అడవి కేగి కట్టెలు కొట్టి మోపులు తెచ్చిరి. భిక్షాటన మొనర్చిరి. బ్రహ్మచర్యము నెఱపిరి. అట్లు శుశ్రూష యొనర్చుచు ఆఱు నెలలలో ఆ గురువు చెప్పగలిగిన దాని నంతటిని నేర్చిరి. అతి మానుషమైన మేధాశక్తిచే అచిరకాలమున విద్య ముగించి ఆచార్యునకు దక్షిణ నీయ దలచి 'స్వామీ! ఏమి కోరెదవో కోరు' డనిరి. ఆ ముని భార్య 'నాయనా! సంవత్సరము క్రిందట నా పుత్రకుని యముడు కొని పోయెను. ఆ మృత్యుసదనమునుండి మరల ప్రాణములతో నా కుమారుని తెచ్చి యిం'డని కోరెను. రామకృష్ణుల అసాధారణప్రజ్ఞ నెఱిగియే ఆమె అట్లడిగినది. రామకృష్ణులు గురుపత్ని వాంఛించిన రీతి ఆమె కుమారుని తెచ్చి యిచ్చి ఆచార్యు ననుజ్ఞను స్వీకరించి సమస్తవేదవేదాంగశాస్త్ర ధర్మకోవిదులై తత్త్వవిశారదులై తిరిగి మధురానగరమునకు తల్లిదండ్రుల చెంతకు చేరిరి. పుత్రుల జూచుటతోడనే వారికి పోయిన ప్రాణములు తిరిగి వచ్చిన ట్లయ్యెను.

నేడు బీహార్ అనబడునది పూర్వము మగధ. ఆ కాలమున మగధ నేలుచుండిన రాజు జరాసంధుడు మహాబలశాలి. అతడు కంసుని మామ. కంసుని శ్రీకృష్ణుడు వధించుటతోడనే కంసుని భార్య లిరువురు తండ్రియైన జరాసంధుని పాలి కరిగి తమ కట్టి స్థితి కల్పించిన కృష్ణుని తమ కసి తీరునట్లు శిక్షించుమని ఘోరున ఏడ్చి తండ్రిని ప్రోద్బలము చేసిరి. జరాసంధుడును వారి మాట లాలకించి రోషకషాయితనేత్రుడై పెద్ద సైన్యమును వెంట నిడుకొని మధురపైకి దాడి వెడలి నగరమును ముట్టడించెను. తన సేన ఎంత పెద్ద దయినను యుక్తిసంపన్నుడైన శ్రీకృష్ణుని నేర్పుకతన ఉగ్రసేనుని స్వల్పసేనచే పరాభూతమై అపజయముతో తిరిగి వచ్చెను. కాని, జరాసంధుడు పరాభూతుడయ్యు మఱింత కోపోద్దీపితుడై రెండవసారి మధురను తాకెను. మరల శ్రీకృష్ణునిచే ఓడింపబడెను. ఇట్లు పరాభూతు డగుట మరల దాడివచ్చుట పదునేడు పారులు జరిగినది. ఇ వ్విధమున సర్వనాశనము నొందియు జరాసంధుడు ద్వేషమును వీడలేదు.



# ద్వారక

శ్రీకృష్ణుని జీవితమును మనము పరిశీలించినచో అత డెప్పుడును ముందుగా కలహమునకు దిగువాడు కాడని తెలిసికొందుము. అన్యులొనర్చు దుర్మార్గమునుండి తనను రక్షించుకొనుటయే వాని కృత్యము. అనవసరముగ నరరక్తమును చిందజేయుట వాని కిష్టము లేకుండెను. ఎట్లయినను శాంతితో పనుల సాధించుటయే వాని మార్గము. కాని, ఏదియును పొసగక యుద్ధమే తప్పని పక్షమున శత్రువులకంటె తాను తక్కువవాడను కానని రుజువు చేసెను. అట్టి వేళల మనఃపూర్వకముగ క్షమింపుమని వచ్చిన బ్రతికిరి; తలబిరుసున పెడదిరిగి పోరాడినవారు సర్వనాశనము నొందిరి. వీని మూలమున శ్రీకృష్ణుని ధర్మరక్షణవిధానము మన కర్థమగును. సర్వజనుల విషయములను గ్రహించగలవా డాతడు. కంసుని చంపెను. కాని వానికొఱకు ఏడ్చెను. అట్టి మృదుహృదయమునకు యుద్ధమునం దభిరుచి యుండదు. అసంఖ్యాకులు మానవులు యుద్ధదేవతకు బలియగుట వారి కిష్టము కాదు. కావున మరల మరల జరాసంధుడు మథురపై యుద్ధమునకు వచ్చుటవలన కలుగుచున్న జననష్టమును ఆపుటకు శ్రీకృష్ణు డొక ఊహ చేసెను. ద్వారకాద్వీపమున ఒక నగరమును, దాని చుట్టును ఒకకోటను నిర్మించుటకు ఆజ్ఞలిచ్చెను. అది పూర్తియగుటతోడనే శ్రీకృష్ణుడు ఉగ్రసేనుని ముఖ్యపట్టణము నచ్చటికి మార్చెను. దానికి రైవతకాద్రి సహజరక్షణముగ నుండెను. శ్రీకృష్ణుని యీ కార్యము సులభముగ జరుగలేదు. ఒక ప్రక్క జరాసంధుడును, మఱియొక ప్రక్క కాలయవనుడను అనార్యరాజును ఏకకాలమున యుద్ధమునకు వచ్చిరి. కాలయవనుడు తన మిత్రుడైన జరాసంధుని సహాయార్థము వచ్చినాడు. ఇరువురును మథురను ముట్టడించిరి. శ్రీకృష్ణుడు రక్తపాతమును

సహించలేకుండెను. అందుల కతడు ఒక యుక్తి బన్నెను. ఒక్కడే మారువేసమున కాలయవనుని పటకుటీరమున కేగి, అతనిచే కనుగొన బడి వెంటాడబడి పరుగెత్తెను. శ్రీకృష్ణుని పరుగు నాత డందుకొన లేక పోయెను. పోయి పోయి కృష్ణ డొక గుహ జొచ్చెను. కాలయవనుడును గుహ జొచ్చి అట నేల బడియున్న ఒకని జూచి కృష్ణ డనుకొని కాల దన్నెను. అతడు ముచికుందుడను ఋషి. ఆ ఋషి కోపోద్రిక్తుడై లేచి రక్తారుణనేత్రముల కాలయవనుని జూచెను. ఆ దృగగ్నికీలల కతడు దహించి భస్మ మయ్యెను. అంతయు జూచిన శ్రీకృష్ణుడు తిరిగి మధురకు వచ్చెను. కాలయవనుని మృతి అతని సైనికులకు తెలియుటతోడనే వారు తమ రాజ్యమునకు మరలి పోయిరి. జరాసంధుని సేనను గెల్చుటకు యాదవులకు కష్టము కాలేదు. ఈ రీతి శత్రువుల జయించి శాంతియుతుడై శ్రీకృష్ణుడు యాదవులను వెంటగొని ద్వారకను ప్రవేశించెను. నాడు మొదలు శ్రీకృష్ణుడు ద్వారకయందే ప్రశాంతముగ నివసింపసాగెను. ఇది జరిగిన పిదప విదర్భాధిపతియైన భీష్మకుని కుమార్తె సౌందర్యవతి యగు రుక్మిణి వివాహప్రస్తావన లారంభమైనవి. కృష్ణ డామెను తన కిమ్మని భీష్మకుని నడిగెను. రుక్మిణికిని కృష్ణునిపై గాఢమగు ప్రేమ నెల కొనెను. కాని, భీష్మకుడు జరాసంధుని మాటలకు వశుడై తన పుత్రికను కృష్ణున కిచ్చుటకు సమ్మతింపక, అతనికి ప్రబలశత్రువైన శిశుపాలున కిచ్చుటకు నిశ్చయించుకొనెను. ముహూర్తము నిశ్చయింపబడినది. యాదవులు తప్ప రాజు లెల్లరు ఆహ్వానింపబడిరి. ఆకాలమున రాక్షస వివాహము సర్వక్షత్రియులచే అంగీకరింపబడిన దగుటచే అట్టి విధాన మున కృష్ణుడు బలాత్కారముగా రుక్మిణి నెత్తుకొని పోదలచెను. వివాహదినమున రుక్మిణి నగరము వెలుపల గల గౌరి ఆలయమున పూజ గావించి మరలి గృహమునకు వచ్చుచుండెను. ఆ సమయము కనిపెట్టి రథముతో వచ్చి యున్న కృష్ణుడు రుక్మిణిని రథమం దిడుకొని

పోజొచ్చెను. ఇది విని రాజు లందఱు భీష్మకునితో కూడి వచ్చి శ్రీకృష్ణు నడ్డగించిరి. అసంఖ్యాకులగు సైనికులను శత్రురాజులను కడు సమర్థతతో చిందఱ వందఱ యొనర్చి విజయము సాధించి క్షేమముగా రుక్మిణితో కృష్ణుడు స్వస్థానమునకు చేరెను. మహావైభవముగ వారికి వివాహ మహోత్సవము జరిగినది. పరస్పరానురాగబద్ధహృదయులైన ఆ దంప తుల సంతోషము అనిర్వచనీయము.

కంసునివలె ఎల్ల దేవతలను ధిక్కరించిన దుష్టభూపాలుడు నరకుడు ప్రాగ్జ్యోతిషమునకు పరిపాలకుడు. భూదేవికి కుమారుడనియు పదునాఱువేల కుమార్తెలకు తండ్రి యనియు అతనిని గూర్చి చెప్పుదురు. దేవత లందఱకు తల్లియైన అదితియొక్క కర్ణకుండలములను అత డొకప్పు డపహరించె నని శ్రీకృష్ణునితో దేవేంద్రుడు స్వయముగా వచ్చి చెప్పుకొనెను. శ్రీకృష్ణు డింద్రునకు తిరిగి కుండలములు సాధించి యిచ్చెద నని అభయహస్తము నిచ్చెను. కృష్ణు డంతట దండు వెడలి నరకుని సంహరించి వాని పదునాఱువేలమంది పుత్రికలను వివాహమాడెను. భూదేవి స్వయముగ వచ్చి కృష్ణునకు కుండలము లర్పించి నరకుడు తన కుమారుడే యని చెప్పి అదృశ్య యయ్యెను. ఇదొక అప్రాకృతికగాథ యగుటంజేసి దీనిని పెక్కురు నమ్మరు. ఇందు అన్యాపదేశమగు అర్థాంతరము స్ఫురించును. ముక్తినొందుట ప్రాణి స్వభావము. ఆ స్థితిలో అది పూర్ణ సుఖమును పొందును. స్వతస్స్థితిని అందుకొనును. ఈ ఆనందస్థితినే స్వర్గ మందురు. ప్రాణి స్వాతంత్ర్యమును భగ్న మొనర్చున దేది యైనను స్వర్గమునకు వ్యతిరేకమే. అది నరక మనబడును. నరక మన నేమి? కామమే నరకము. కామమే మానవుని ఈ పుడమిపై బంధించుచున్నది. ఈ కామ మెచ్చోటునుండి వచ్చినది? ప్రాణికి ఇహముతోడి సంబంధము వలన అనగా ప్రకృతితో పురుషుని సాంగత్యమువలన. శ్రీకృష్ణు డీ కామమును చంపెను. దాని బిడ్డలయిన దుఃఖములను మహాభోగ్యములుగ

మార్చి తనకు పశ్యురాండ్రైన భార్యలుగ చేసికొనెను. ఇంద్రుడు కనబడని గురువుగా భాషించును. కామము చేయగల మోసము నతడు వ్యక్తము చేయును. కామమునకు దేవతలు సయిత మెట్లు మోసపోయిరో మోసపోదురో ఇందు వ్యక్తమగును.

తరువాత బాణుడను మఱియొక రాక్షసుని శ్రీకృష్ణుడు సంహరించెను. ఆపైపౌండ్రపతియైన వాసుదేవునితో పోరెను. వసుదేవుని కుమారుడని మాత్రమే కాక భగవంతుడను అర్థము శబ్దమునకు కలదు. దానిని పురస్కరించుకొని ఆ రాజు తానే భగవదవతారపురుషుడ ననియు వసుదేవసుతుడైన శ్రీకృష్ణుడనామకుడనియు వాదించెను. అది విని శ్రీకృష్ణుడు వానిని యుద్ధమునకు బిలిచెను. ఆ యుద్ధమున పౌండ్రపతి సకలపరివారసహితముగ నిహతుడయ్యెను.

యదు అనువాడు యయాతియొక్క జ్యేష్ఠపుత్రుడు. తండ్రిచే శపింపబడి అతడు వాని అనంతరము సింహాసనము నధిష్ఠించలేదు. కనిష్ఠుడైన పురు అనువాడు తండ్రి రాజ్యమును పాలించెను. అతని వంశస్థులే యాదవులు. ఈ యాదవులు భిన్నశాఖలుగ విస్తరించిరి. వృష్ణి అంధక కుకుర భోజ మొదలయినవి. శ్రీకృష్ణుడు వృష్ణివంశములోనివాడు. కంసుడు దేవకి భోజవంశమువారు. యాదవు లనేకులు ద్వారకలో వసించుచుండిరి. ఉగ్రసేనుడు రాజుగా నుండెను. కృష్ణుడు రాజవ్యవహారములు నడపుచుండెను. సకలబంధువులయందును ప్రసన్నుడై ప్రేమమూర్తిగా కృష్ణుడు వర్తించుచుండెను.

ఆ కాలమున ద్వారకలో సత్రాజిత్తను యాదవుడుండెను. అతని యొద్ద శమంతమను దివ్యమణి కలదు. దానిని రాజున కిమ్మని శ్రీ కృష్ణుడాతనికి ఉపదేశించెను. ఈ మణిమూలమున తన వారిలో ఎట్టి భేదాభిప్రాయములు పుట్టునో అనుకొని శ్రీకృష్ణుడు వానిని మణివిషయమున బలవంత పెట్టలేదు. సత్రాజిత్తు ఆ మణిని వీడుట కిష్టపడక, దానిని

కృష్ణుడు గ్రహించునేమో యనుకొని భయపడి, తన సోదరుడైన ప్రసేనునకు మణి నొసంగెను. ఆ మణిని ధరించి ప్రసేను డొకనాడు వేటకు పోయి అడవిలో నొక సింహముచే సంహరింపబడెను. మణి ఇట్లు నష్టమైనది. కృష్ణుడే మణికొఱకు తన సోదరుని జంపినా డను నింద మోపి ఒక ప్రవాదమును సత్రాజిత్తు పుట్టించెను. అందులకు కృష్ణుని మనస్సు నొచ్చుకొనినది. ఎట్లయినను మణిని సాధించి ఈ అపనిందను తొలగించుకొన దలచి శ్రీకృష్ణుడు ప్రసేనుడు చంపబడిన ప్రదేశమున కేగెను. అచ్చోటి నెత్తుటి మడుగువలనను, సింహపు అడుగుల జాడల వలనను ప్రసేనుని మరణవిధానమును తెలిసికొనెను. కొంత దూరమున సింహపు అడుగుల చెంత ఎలుగుబంటు అడుగుల జాడయు కలదు. దానినిబట్టి సింహమును భల్లూకము చంపియుండవచ్చునని తీర్మానించెను. అంతట ఎలుగు పాదచిహ్నముల వెంట నడచి ఒక గుహ జేరి ఎలుగుతో పోరి లొంగదీసి మణిని గ్రహించెను. పూర్వము రావణునితో పోరినపుడు రామునకు సహాయము చేసిన జాంబవంతుడే ఈ భల్లూకము. జాంబవంతుడు కృష్ణుని బలశౌర్యములకు సంతసించి కృష్ణు డెవరో తెలిసికొని సౌందర్యవతియైన తన పుత్త్రి జాంబవతి యను కన్యను వాని కిచ్చి వివాహము చేసెను. తిరిగి శ్రీకృష్ణుడు నగరమునకు వచ్చి సత్రాజిత్తును పిలిచి మణి నొసంగెను. అతడును అంతయు విని సంతుష్టుడై తన కుమార్తెయైన సత్యభామను కృష్ణున కిచ్చి పెండ్లి చేసెను. ఇట్లు శ్రీకృష్ణుడు చాలమంది పడుచులను పెండ్లాడెను. నరకుని కొమరితల విషయము మాత్రము ఆలంకారికముగ కన్పట్టును.

అప్పుడు పాంచాలమును ద్రుపదుడను రాజు పరిపాలించుచుండెను. అతని కుమార్తె ద్రౌపది. ఆమె అత్యంతసౌందర్యవిరాజమాన. ఆమె కతడు వివాహము చేయ దలచి మత్స్యయంత్రమును ఏర్పఱచి దానిని భేదించు రాజపుత్రునకు ఆమె నిత్తునని స్వయంవరము చాట బంచి సకల

•జలోకము నాహ్వానించెను. ఆ కన్నెకై రాజు లెల్లరు వచ్చిరి. యుధిష్ఠిరుని రాజ్యము నపహరించి అతనిని నలుగురు తమ్ములతో వెడలగొట్టి పుడమి నేలుచున్న దుర్యోధనుడును సకలబంధుపరివార పరివృతుడై ద్రౌపదిని పరిణయమాడ వచ్చెను. యుద్ధవిశారదులును రాజ్యాంగవేత్తలును అయిన భీష్మద్రోణకర్ణాదులును వాని వెంట కలరు. పైన ఎత్తుగా మత్స్యము కట్టబడి యుండెను. క్రింద జల ముండెను. క్రింద నున్న జలమును జూచుచు పైనున్న మత్స్యము నెక్కుబెట్టి సూటి తప్పక కొట్టిన వానికి ద్రౌపది భార్య కాగలదు. రాజులు ఒకరి తరువాత ఒకరు యత్నించుచుండిరి. అందఱి లక్ష్యములు తప్పిపోవుచుండెను. విల్లు క్రిందబెట్టి విచారముతో ప్రతివారును తమ ఆసనములకు తిరిగి వచ్చి నమ్రముఖులై కూర్చొనుచుండిరి. క్షత్రియు లందఱును అవమానితులై యుండిరి. విజేత లేకుండెను. ఏ కులములోని వీరు లయినను వచ్చి యత్నించవచ్చును. అని ద్రుపదుడు సభాముఖమున ఎలుగెత్తి పలికెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. ఎవ్వరును లేవలేదు. కొంత సేపటికి సుందరుడైన ఒక బ్రాహ్మణయువకుడు వచ్చి వి ల్లందుకొనెను. అందఱును పరిహసించిరి. పిచ్చివాడని గేలిచేసిరి. అయినను లెక్కించక అతడు గుఱిపెట్టి మత్స్యమును భేదించెను. ఎందఱో రాజులు రాజ కుమారులు పొంద దలచిన ఆ రాజకన్య ఆ యువకున కీయబడినది. ఆ బ్రాహ్మణయువకుడు కన్యాసమేతుడై తన యింటికి పోబోవ, అచట నున్న రాజులు నలువైపుల నతని నడ్డగించి పోరుటకు తలపడిరి అతనికి దృఢకాయుడైన మఱియొక బ్రాహ్మణయువకుడు తోడయ్యెను ఆ యిరువురును క్షత్రియుల నెదిరించి అచిరకాలమున పలాయితుల జేసిరి. అచ్చోట శ్రీకృష్ణు డుండెను. ద్రష్టగా మాత్రమే అత డుండి సర్వమును చూచెను. వీరవరులైన ఇరువురు బ్రాహ్మణయువకుల రాజకులము నంతటిని పాఱద్రోలుట జూచి వా రెవరో ఆయన గ్రహిం

చెను. దుర్యోధను డొనర్చిన మాయవలనను ద్రోహమువలనను హతులైరని వాడుకపడిన పాండుపుత్రులే వారని ఆయన నిశ్చయించెను. తన అభిప్రాయము నిజ మగునో కాదో ఎఱుగ గోరి వా రిరువురి వెంట తా నేగి మఱి మువ్వురితో వారు కలియుట చూచెను. అయిదుగురును నవవధువును వెంటగొని ద్రుపదుని నగరమునకు కొలది దూరమున నున్న ఏకచక్రపురమున ఒక కుమ్మరి వాని యింటికి చేరి వృద్ధురాలైన తల్లిని సమీపించి 'జననీ! మేము నీ కొక కోడలిని తెచ్చితిమి' అనిరి. కృష్ణుని నిశ్చయము సత్యమని రుజువయ్యెను. అంత నాతడు బయల్పడి యుధిష్ఠిరునకు నమస్కరించెను. నల్వురను కౌగలించుకొనెను. కుంతికి ప్రణామము చేసెను. కృష్ణునకు కుంతి మేనత్త. వసుదేవునికి తోబుట్టువు. అదొక సుఖసమాగమము. కృష్ణుడు కుంతీయుధిష్ఠిరులకు తిరిగి నమస్కరించి ఆ రాత్రికి సెలవు గైకొని యేగి మఱునా డుదయమున వస్తువాహనాది బహుళసంపత్సమేతముగా వచ్చి సర్వమును వారి కర్పించెను. ద్రుపదుని కుమారుడు దృష్టద్యుమ్నుడును మాఱువేసమున సర్వమును గ్రహించి వచ్చి ద్రుపదునకు చెప్పెను. అంత ద్రుపదుడు ఏకచక్రపురమునకు వచ్చి పాండవులను తన నగరునకు గొంపోయి రామకృష్ణాదియాదవులందఱతో గూడి వివాహమహోత్సవ మతివైభవముగ జరిపెను. పాండవమధ్యముడైన అర్జునుడే కన్యను గొన్నవాడైనను కుంతియొక్క ఇష్టము ననుసరించి అయిదుగురు పాండవులును ద్రౌపదిని వివాహ మాడిరి. అది ఆచారమునకు విరుద్ధము. కాని, తల్లి ఆనతి ఆచారమునకంటెను మిక్కిలి విలువ గల అనుశాసనము. ఇంకను, నాటి శాసనకర్తలైన ఋషులు ఈ ప్రత్యేకవిషయమున తమ సమ్మతిని దెలిపిరి.

దుర్యోధనుని తండ్రియు యుధిష్ఠిరుని పిన తండ్రియు నగు గ్రుడ్డిరాజు ధృతరాష్ట్రుడు పాండవు లింకను జీవములతో నుండి రనియు ద్రౌపదిని వివాహ మాడిరనియు వినుటతోడనే భీష్మవిదురాదిసచివుల

అభిప్రాయము ననుసరించి తన కుమారులైన కౌరవులకును పాండవుల కును ఒక సంధి కుదిర్చి ఖాండవప్రస్థ మను పట్టణము రాజధానిగా పాండవులకు అర్ధరాజ్యమును పాలించుకొండని యిచ్చెను.

అనతికాలములో యుధిష్ఠిరుడు వీరాధివీరులయిన తన నలుగురు తమ్ముల శౌర్యపరాక్రమముల మూలమున భారతదేశము నందలి నాటి రాజు లందఱిలో మిక్కిలి బలవంతు డయ్యెను. వారు పరిసరరాజ్యముల జయించిరి. విజయములు సాధించి సంపదలు పండించి తమ నగరమును భూలోకస్వర్గముగ సకలాలంకారశోభితముగ లక్ష్మీ సంపన్నముగ నొనర్చిరి. శ్రీకృష్ణునకు పాండవమధ్యముడైన అర్జునుడు ప్రియ బంధుడుగా. ప్రియసఖుడుగా. ఆత్మీయుడుగా నుండెను. వా రిరువురు కలసి యుటుగుచుండిరి. వారి అన్యోన్యప్రేమ ఏకత్వము నందిన ట్లుండెను.

పాండవులు తమ రాజ్యములో సుఖముగా నుండిరి. శ్రీకృష్ణుడు ద్వారకలో నుండెను. ఒకానొక కారణమున అర్జునుడు భూప్రదక్షిణము చేయ దలచి సర్వతీర్థములను సేవించుటకు బయల్వెడలెను. అత డనేకపుణ్యక్షేత్రముల దర్శించెను. అనేకనదులందు అవగాహన మొనర్చెను. తుద కతడు ద్వారకకు వచ్చి శ్రీకృష్ణునిచే ఆదరముతో స్వీకరింప బడెను. అక్కడే వసించుచు సుఖముగా కాలము గడపు చుండెను. ఒకనాడు దేవాలయమున పూజలు సలిపి వచ్చుచున్న ఒక చక్కని కన్యను జూచి ఆమె సౌందర్యమునకు మోహితుడై అర్జునుడు కృష్ణునితో సంభాషించు చున్నవాడు అసందర్భముగ అన్యాయత్తచిత్త ముగ మాట లాడెను. కృష్ణు డందులకు గల కారణమును గ్రహించెను. అర్జునుని స్థితిని గూర్చి ప్రశ్నించెను. అతడు సిగ్గుపడెను. సందేహించ వలదనియు ఆ కన్య తన సోదరియైన సుభద్ర యనియు బలాత్కారముగ ఎత్తుకొని పొమ్మనియు అట్లు చేయుట క్షత్రియధర్మవిరుద్ధము కాదనియు

చెప్పెను. సోదరు డట్లు తన సోదరి విషయమున అన్యునితో బలాత్కారముగ ఎత్తుకొని పొమ్మని చెప్పవచ్చునా? అను ప్రశ్న కలుగవచ్చును. కాని, అర్జునుని బలశౌర్యాదిలక్షణములను కృష్ణు డెఱిగిన వాడు. తన సోదరిని మహావీరు డొకడు సర్వలక్షణసంపన్నుడు ప్రేమించుటయు, అత డెత్తుకొని పోయి ఆమెను వివాహము చేసికొనుటయు ఆమెకు క్షేమము సుఖముకు అయిన విషయము. సోదరియొక్క సుఖక్షేమములను సోదరుడు తన కాలపరిస్థితుల కనుగుణముగ ఆలోచించి అది నెరవేర్చుటకు తగు యుక్తిని బన్నుటను గూర్చి బుద్ధిమంతులు ఆక్షేపించరు.

ప్రియమిత్రుని హితవాక్యము నాధారముగా గొని కుంతీయుధిష్ఠిరుల సమ్మతిని తెలిసికొని అర్జునుడు సుభద్రను బలాత్కారముగ గ్రహించి రధమునం దిడుకొని పోవుచుండెను. ఇది తెలిసి యాదవులు ఆయుధములు చేబట్టి వాని నడ్డగించిరి. పెద్ద పోరు జరిగెను. ఎల్లరను మిక్కిలి నేర్పుతో ఎదుర్కొని విజయము సాధించి సుభద్రను సుఖముగా వెంట బెట్టుకొని తన స్థానమున కేగెను. పిమ్మట అర్జునునకును యాదవులకును కృష్ణుడు సంధి కుదిర్చెను. పిదప ద్వారకలో సుభద్రాపరిణయ మతివైభవముగ జరిగెను.

అర్జునుడు ద్వారకలో సుభద్రాసహితుడై కొంతకాలము సుఖముగ గడపి ఒకనాడు సుభద్రాకృష్ణులతో గూడి ఖాండవప్రస్థమునకు వచ్చెను. కుంతీయుధిష్ఠిరాదులు వారి రాక కెదురు చూచుచుండిరి. నగరము నగరమే వారి ఆగమనమునకు మహాసంతోషమున తేలియాడెను. శ్రీకృష్ణుని దివ్యరూపములో ఆ సంతోషము కలదు, ఆ శాంతి కలదు. అత డెక్కడ కేగినను అట్టి జ్ఞానభాషణము అట్టి జగత్తోషణము వెదజల్లి పరిహాసభూషణుడై ఆనందమును గురిపించి నిర్జీవముగ నున్న చోటుల జీవమును నింపి సుఖశాంతులు వ్యాపింపజేసి తేజస్సును వెలిగించి ఆ చోటును వీడినప్పుడు అది సూర్యుడు చాటున కేగి నప్పటి స్థితిని పొందు

నట్లు వర్తించెను. అందులకే శ్రీకృష్ణుడు ఖాండవప్రస్థమున నున్నంత కాలము ఆ నగరమున నిత్యమంగళము పచ్చతోరణముగ ప్రతిదిన ముత్సవమువలె భాసించె ననుటలో వింత యేమున్నది!

ఒకనాడు కృష్ణార్జునులు ఖాండవవనములో నడచుచుండిరి. అగ్ని దేవుడు వారిముందు నిలిచి 'స్వామీ! నాకు మిక్కిలి ఆకలి యగుచున్నది. ఈ అడవిని దహించెదను. ఇందులకు మీరు సహాయపడవలెను' అని ప్రార్థించెను. అంతకు పూర్వము అగ్ని అనేకపర్యాయములు యత్నించెను. కాని, ఇంద్రు డా వనమున కధిపతి యగుట వలన వాని యత్నములు సాగనీయక అడుగడుగునను వర్షములు కుమ్మరించుచుండెను. వా రిరువురు ఇంద్రుని ఆటంకములను నివారించినచో, మఱి యొక తీరున తీఱని తన యాకలిని ఆ మహాటవిని మ్రింగి తీర్చుకొందు ననెను. వారు ధనుర్బాణములు ధరించి అగ్నిని అటవీదహనమునకు పురికొల్పిరి. నలుదిక్కుల అగ్ని ప్రజ్వరిల్లెను. మహావృక్షములు లతాగృహములు దగ్ధము లగుచు సరసర అగ్ని విస్తరిల్లెను. విల్లమ్ములతో. అగ్నికణములు అడవిని దాటి పోకుండగ, కృష్ణార్జునులు నియమించుచుండిరి. ఆ అడవిలో మయుడను రాక్షసుడు నివసించుచుండెను. అగ్ని తనను మ్రింగకుండ తప్పించుకొని పోవుచుండ అర్జును డతని నడ్డగించి ఆపెను. తనను రక్షింపు మని అత డర్జునుని పాదములపై బడెను. అతడు కరుణించి నీ యిచ్చ వచ్చిన చోటి కేగు మని విడిచి పుచ్చెను. ఇంతలో ఇంద్రుడు తన వనమున మరల అగ్ని ప్రజ్వరిల్లుటం గాంచి అన్ని వైపుల వర్షమును ముంచెత్తెను. కాని, కృష్ణార్జునులు వర్షము అడవిపై బడకుండ నిరోధించిరి. ఇందులకు ఇంద్రుడు మండిపడి ఒక పెద్ద కొండను వారిపై బడవైచి, దాని క్రింద వారు పడి చత్తురని భావించెను. కాని, వా రా కొండను పిండిచేసిరి. ఇంద్రుడు వారిపై నొక పిడుగును విసరి వేయ దలచెను. అంత నొక అశరీరవాణి 'ఓయీ! వీ

రెవ్వ రనుకొనుచుంటివో ! పురాణమునులైన నరనారాయణుల అవతారములు. నీ కృత్యము నిరర్థకము' అని పలికెను. ఇంద్రుడు శాంతించి వారితో సమాధాన పడెను. అగ్నియొక్క క్షుధ శమించెను.

అర్జునునిచే విడిచి పుచ్చబడిన రాక్షసుడు వానికి ప్రత్యుపకారము చేయ దలచెను. తన విధిని అనుష్ఠించిన అర్జునుడు ఆ ప్రత్యుపకారమును స్వీకరించ దలచలేదు. అతడు బలవంత పెట్టెను. అప్పుడు తన మిత్రుడైన శ్రీకృష్ణుని కేదైన సేవ చేయు మనెను. అత డందులకు శ్రీకృష్ణు నర్థించెను. అప్పుడు శ్రీకృష్ణు డతనిం జూచి. 'ఓయీ ! నా కొక కోర్కె కలదు. నీవు రాక్షసులలో శిల్పివి కదా ! యుధిష్ఠిరుని కొక అనుపమానసౌందర్యము గల చిత్రవిచిత్రమయిన మహాసంపత్సమృద్ధమగు సభాభవనమును నిర్మింపుము' అని పలికెను. మయుడును శ్రీకృష్ణునాజ్ఞ శిరసావహించి తన చాతుర్యమును శక్తిని అంతటిని వినియోగించి ఒక దివ్యభవనమును ఇదివఱ కెన్నడును ఏ మానవుడును చూడనట్టి విధమున కడు మనోహరముగ నిర్మించి, శాంతుడు పవిత్రుడు ఉత్తముడు అయిన యుధిష్ఠిరమహారాజునకు సమర్పించెను.

శ్రీకృష్ణుని జీవితమందలి ఈః కథయు అప్రాకృతిక మైనది. కొందఱు దీనిని విశ్వసించుటకు సంశయింతురు. కారణ మేమన, వారికి జడమైన అచేతనమైన ద్రవ్యముతో కూడిన ప్రకృతియందును, ప్రకృతి శక్తులందును మాత్రమే విశ్వాసము. జ్ఞానసంపన్నమైన మఱొక శక్తి ప్రకృతిద్రవ్యములందలి ప్రతి అణువును క్రమపద్ధతిలో వర్తింపజేయుచు నడపుచు రీతి దప్పక నిలుపుచున్నదని వారు విశ్వసించరు. వారి భావ మెంతవఱకు అంగీకారయోగ్యమో పరిశీలింతము. ఈః దృగ్గోచరమగు ప్రకృతియొక్క స్వతంత్రమైన ఉనికిని విశ్వసించువారు ఒక తప్పు చేయుచున్నారు. శబ్దస్పర్శరూపరసగంధములు ప్రాణిభిన్నములుగను, దానింబట్టి ప్రాణి తదంతర్గతాత్మకు భిన్నముగను భావించుచున్నారు.

వారి వాద మేమన, దేశకాలములు అందున్న ప్రకృతి పురుషునకు భిన్నములుగ నిలుపగలవు అని. ఒకడు మరణించిన, ప్రపంచ మతనితో మరణించుచున్నదా? మిగిలిన వారికొఱకు ప్రపంచము శాశ్వతముగ జీవించుచున్నది. కాని, ఆ మిగిలిన వారు కూడ మరణింతు రనుకొందము. శబ్దస్పర్శరూపరసగంధములతో కూడిన ఈ ప్రకృతియొక్క ఉనికి ఏడ? దీని ననుభవించు చైతన్యవంతమైన ప్రాణి లేక ఇది నిలువ గలదా? అవ్యక్తముగా ప్రాణిభిన్నముగా ఏదో ఒకటి కల దనవలెను. కాని, వ్యక్తము ఈ ప్రకృతి. ప్రాణిభిన్నముగా ఈ ప్రకృతి నిలువలేదు. మనము ప్రకృతిగతులము. అందువలన ఈ విశ్వము జీవాజీవముల ఆత్మద్రవ్యముల ప్రకృతిపురుషుల సమ్మిశ్రణము. జలాణువు అణువుకాదు, పరమాణువు. ప్రాణవాయుజలవాయువుల మిశ్రణము. అటులనే ప్రకృతిలోని అణువు ఆత్మద్రవ్యముల మిశ్రణము. ఈ సమస్తవిశ్వము ఒక జ్ఞానసంపన్నమైన ఆత్మతో కలిసి యున్నది. అందుచేతనే సర్వశక్తిమంతము. శక్తి జ్ఞానము కలిసియే యుండును. వ్యక్తమగు ప్రకృతి అనంతములైన దేశకాలములయందు నిలచి యున్నది. అందుచే అదియు అనంత మగుచున్నది. కావున ఆత్మ అనంతము శాశ్వతము. సర్వజ్ఞము సర్వశక్తిమంతము శాశ్వతము అనంతము అయిన ఆత్మ దేవుడు అను పేరున వ్యవహరింపబడుచున్నది. వ్యష్టి యగు మానవుడు ఈ దేహమున బద్ధుడై స్వల్పజ్ఞుడ నని ఈ చిన్న శరీరము కలవాడ నని అల్పకాలము జీవించు వాడ నని భావించును. అందువలన సర్వశక్తిమంతమైన ఆత్మను ఆరాధింప కుండలేడు. ఎందు కనగా, అతని కనేక వాంఛలు కలవు. వానిని పండించ గోరును. దేవుడు తలచినచో అచిరకాలమున అవి ఫలించునని అత డనుకొనుట యుక్తమే. ఈ కారణముగ అతడు పూజాదులచే దేవునికి ప్రీతి గూర్చ గోరును. తన యోగక్షేమముల భారమును దేవునికి అప్పగించును. దేవునియందలి ప్రేమ

మిక్కుటమైన కొలది వాంఛలు ఆశలు అతనిని వీడును. తుదకు దేవునికి తా నత్యంతసన్నిహితుడ నని భావించి తన ఆత్మను దేవునియందు కేంద్రీకరించును. ప్రాపంచికమును విస్మరించును. ఆత్మానందమున మునిగిపోవును. తన వ్యక్తిత్వమునే మఱచిపోవును. వ్యక్తిత్వమును నిల్పుకొనువాడు దేవుని అనంతత్వమును భావించలేడు. అంతవత్తులో అనంతము ఎట్లు ఇముడగలదు? కావున, అతడు దృగ్గోచర మగు వైభవ మూర్తులయిన సూర్యునిలో చంద్రునిలో అగ్నిలో విద్యుత్తులో వర్షము మొదలయిన వానిలో దేవుని దర్శించి ఉపాసించును. సర్వవ్యాపి సర్వశక్తి మంతుడు అగు దేవుడు వారి అభీష్టమును తీర్చు నిమిత్తము ఈ దృగ్గోచర రూపములలో అవతరించును. ఇట్టి దృష్టాంతములు అనేకములు జరిగి నట్లు మనము ఉపనిషత్తులలో చదువుదుము. అంతటను భగవానుని చూడ గల వానికి ప్రకృతి జడముగ మృతముగ నిర్జీవముగ కన్పట్టదు. ప్రతిది ఆత్మవంతము దేవాంశసంపన్నముగ గోచరించును. కృష్ణార్జును లట్టి దేవాంశసంపన్నులు. జడమృతప్రకృతిలో జీవించు మనవంటి వారు కారు వారు. మన మెంత యత్నించినను వారి జ్ఞానముయొక్క లోతులు తడవ లేము. మనకు అసహజముగ అప్రాకృతికముగ కనబడు విషయములతో వారు సంబంధపడినపుడు వారిని తప్పుగా మన మర్థము చేసికొనరాదు. కృష్ణునివంటి వారి నిర్మాణము మన దాని వంటిది కాదు. ఆ పదార్థము వేఱు. కావున మనకు సరిపోవు శాసనములు వారికి పనికిరావు. అందుచే త్వరపడి సిద్ధాంతములు చేయరాదు. ఆ కాలమునందలి రాజసమూహమున జరాసంధుడు మిక్కిలి బలవంతు డనియు అతడు కృష్ణునకు పరమశత్రు వనియు ఇదివఱకు విని యున్నాము. దుర్మార్గముల దుర్గుణముల నతడు కంసున కే మాత్రము తీసిపోవు వాడు కాడు. అతడు భారతదేశ చక్రవర్తి అనిపించుకొనుటకు నూరుగురు రాజులను యజ్ఞపశువు లనుగా ఆహుతి చేయదలచెను. అంత క్రూరచిత్తు డతడు. అందు

కొఱకు ఎనుబది యాఱుగురు రాజుల నతడు పశువులనువలె పట్టి తెచ్చి కారాగారమున నుంచెను. కృష్ణు డిది విని ఆ రాజులను రక్షింప దలచెను. జరాసంధుని సంహరించినగాని ఆ పని కాదు. జరాసంధు నొక్కని దుర్మార్గము మూలమున అనేకుల రక్తమును చిందజేయుట కృష్ణున కిష్టము లేదు. యుద్ధము చేయుటకు మన సొప్పక భీమార్జునులను వెంట నిడుకొని మారువేసమున జరాసంధుని యొద్దకు జేరి ముప్వురిలో ఏ ఒక్కరితో నైనను మల్లయుద్ధమునకు రమ్మని పిలిచెను. ముగ్గురిలో లావుగా బలముగా అగపడుచున్న భీముడే తనకు జోడు కాగల డనుకొని వానినే రమ్మనెను. మఱునాడు రంగము సిద్ధమైనది. భీమజరాసంధుల మల్లయుద్ధ మారంభమై పదునైదు రోజులు సాగినది. చివరకు జరాసంధుడు భీముని చేతిలో ప్రాణములు కోల్పోయెను. మృతిజెందిన ఆ రాజుయొక్క చిన్నకొడుకును కృష్ణుడు రాజ్యాభిషిక్తుని జేసెను. ఎనుబది యాఱుగురు రాజులను కారాగారమునుండి ముక్తుల గావించెను. శుభశాంతులు నేలపై నెల కొనినవి.

కృష్ణు డా తరువాత సమస్తసద్గుణగరిష్ఠుడైన యుధిష్ఠిరుని భరత ఖండమునందే కైకచక్రవర్తిగా సకలరాజసమూహము మధ్య అభిషిక్తు గావింప దలచెను. ఈ ప్రక్రియకు రాజసూయయాగ మని పేరు.

భీమార్జుననకులసహదేవులయిన నలుగురు పాండవులు గొప్ప సైన్యముల వెంట నిడుకొని నాల్గు దిక్కులకు పోయి స్నేహముతో నున్నవారిని ఆహ్వానించుటకును శత్రుత్వము జూపువారిని జయించి ఆహ్వానించుటకును బయలుదేరిరి. భారతదేశమునందలి రాజు లందఱు ఆహ్వానింపబడిరి. నిర్ణీతదినమునకు రాజు లందఱు విలువగల కానుకలు గొని ఖాండవప్రస్థమున కేతెంచిరి. మయనిర్మితభవనమున అభిషేక దినమున కూడిన మహాసభ రాజాధిరాజులతోడను ఋషులతోడను నిండి అత్యంతవైభవముగ మహాగంభీరముగ వెలుగొందెను. నాటి

సభలో ఒక ప్రతిపాదనము బయలుదేరెను. అందఱిలో ఉత్తముడు జ్ఞానాధికుడు అయిన వానికి పూజ సలుపవలయునని ఆ ప్రతిపాదనము. భీష్మని అభిప్రాయము ననుసరించి యుధిష్ఠిరుడు నిస్సందేహముగ శ్రీకృష్ణు డట్టివాడని ఎన్నుకొనెను. అది చూచి కృష్ణునకు పూర్వశత్రు వైన శిశుపాలుడు ఓర్వలేక తనలో డాగియున్న ద్వేషమును ఆపుకొన లేకపోయెను. రాజు లందఱి సన్నిధిలో కృష్ణునివంటి నీచుని అనర్హుని ఉత్తమునిగా ఎన్నుకొనినందులకు భీష్మని యుధిష్ఠిరుని అతడు దూషించ సాగెను. యాగము నాపుటకు ఇతరరాజుల నందఱ నతడు పురికొల్పెను. ఒక పెద్ద కల్లోలము జనించి అభిషేకమున కంతరాయము కాగలదని ఊహించి కృష్ణుడు క్షణకాలములో శిశుపాలుని సంహరించెను. దానితో అంతయు శమించెను. సకలరాజమండలిచే భరతఖండమున కేకైక చక్రవర్తిగా యుధిష్ఠిరుడు కీర్తింపబడి అభిషేకింపబడినాడు. ఈ రీతి ధర్మరాజ్యమును కృష్ణుడు స్థాపించిన వా డాయెను.

యాగానంతరము రాజులందఱు తమ తమ రాజ్యముల కేగిరి. దుర్యోధనుడును తన బలగముతో హస్తినాపురమునకు తరలిపోయెను. కాని, పాండవుల అపారసంపద్వైభవమును కన్నులార చూచుటచే ఈర్ష్యాగ్ని వాని హృదయమును దహింప మొదలు పెట్టెను. అతినీచ మార్గమున అతడు యుధిష్ఠిరుని నాశనము చేయ బన్నెను. శ్రీకృష్ణుడు ద్వారకకు పోయెను. ఆ పిదప దుర్యోధనుడు యుధిష్ఠిరుని ద్యూతమునకు ఆహ్వానించెను. అయిదుగురు సోదరులు ద్రౌపదిని వెంట నిడుకొని ధృతరాష్ట్రుని ఆస్థానమునకు వచ్చిరి. ద్యూత మారంభ మయ్యెను. యుధిష్ఠిరుడు సర్వమును ఓడిపోయెను. ఒకరివెంట ఒకరిని నలుగురు తమ్ములను ఓడెను. అన్నిటికంటె హీనమైన విషయము - భార్యయైన ద్రౌపదిని గూడ ఓడెను. ఆమాట వినుటతోడనే దుర్యోధనుని సోదరు డైన దుర్మార్గుడా దుశ్శాసనుడు వాకిట నున్నదని యైనను చూడక

ద్రౌపదిని రాజులు సభ్యులు తీఱి యున్న నిండుకొలువులోనికి లాగుకొని వచ్చెను. పరమహీను డత డామెపై వస్త్రమును గూడ లాగి వేయుట కారంభించెను. అట్టి తరుణమున శ్రీకృష్ణుడు చిత్రముగ నామెకు సాయ పడెను. ఆమె ఏకవస్త్రమే అనంతముగ పెరిగెను. ఆ దుర్మార్గు డెంత లాగినను వస్త్రమునకు కడ లేకుండెను. లాగిన చీర కుప్పగా పడి పెరుగు చుండెనే గాని ఆమెపై వస్త్రము తుదముట్టుట లేదు. లాగి లాగి దరి గానక చేతులు తీపులెత్తి అలసి కూర్చుండెను. సభలోని సజ్జనుల హృదయములు సంతోషమున పొంగిపోయినవి.

ఈ వింత వలన పాండవుల స్థితి కొంచెము బాగుపడినది. కాని జూదము కడ ముట్టి ఓడి పోయి అందనుకొనిన ప్రకారము వారు భార్యా సమేతముగ పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసము చేయుటకును పదమూడవ సంవత్సరము అజ్ఞాతవాసము చేయుటకును బయల్వెడలి పోయిరి. పాండవు లరణ్యవాసము చేయుచుండ వారి నోదార్చుటకు శ్రీకృష్ణుడు వచ్చెను. వాని సందర్శనమాత్రముననే వారి దుఃఖతమస్సు దూర మేగెను. ఒకింత నిలచి కృష్ణుడు తిరిగి ద్వారకానగరమునకు పోయెను.

ఒకప్పుడు దుర్యోధనుడు దుర్వాసమునిని జేరి ఆయన పందల కొలది గల శిష్యులను వెంటగొని పాండవుల కతిథిగా వెడలు మని ప్రార్థించెను. దుర్వాసు డంగీకరించి అటులనే పాండవుల పాలి కొక నాటి అర్ధరాత్రమున వచ్చి అన్న మడిగెను. అడిగి ప్రక్కన నున్న నదిలో స్నాన మాచరించుటకు శిష్యసమేతముగా వెడలెను. ఇది గ్రహించి శ్రీకృష్ణుడు స్నానము చేయువారి ఉదరములు భుక్తాయాసమున బాధపడు నంత పూర్ణములు చేసెను. దుర్వాసుడు సిగ్గున యుధిష్ఠిరుని చెంతకు రాలేక అటనుండియే శిష్యులతో వెడలిపోయెను.

పాండవులు కామ్యకవనమునం దుండగా శ్రీకృష్ణుడు మఱి యొక సారి వారిచెంతకు వచ్చెను. వా రజ్ఞాతవాసము చేయుచు ఎవ్వరికిని ఎఱుగరాక పదమూడవ సంవత్సరమున మత్స్యదేశాధీశుడైన విరటుని నగరమున గడపిరి. ఆ సంవత్సర మగుటతోడనే విరటుని ఆవుల నపహరించుటకు వచ్చిన దుర్యోధనుని సర్వసైన్యమును పరిమార్చి ఓడించి బయల్పడిరి. విరటుడు సంతుష్టుడై అర్జునుని కుమారుడైన అభిమన్యునకు తన కుమార్తె ఉత్తర నిచ్చి వివాహము చేసెను. పాండవు లరణ్యవాసము చేయు వేళ అభిమన్యుడు ద్వారకలో మేనమామల యింట నుండి వివాహమునకు శ్రీకృష్ణయాదవయుతుడై వచ్చెను. పాండవుల ప్రతిజ్ఞాకాల మైపోయినదని ధృతరాష్ట్రి కొలువున దెలిసెను. దుర్యోధ నాదిబృందము యొక్క హృదయము లొక సుడిలో తిరిగినట్లు కలత నొందెను. యుధిష్ఠిరునితో సంధికై రాయబారము ధృతరాష్ట్రిని చెంతకు పంపుమని ఆదేశించి శ్రీకృష్ణుడు యాదవులతో గూడి ద్వారక జేరెను. అనవసరముగ యుద్ధము పొంత బోయి భూమిని రక్తాంకితనుగా జేయక శాంతిమార్గమున కౌరవపాండవవ్యవహారమును చక్కబెట్టుట యే శ్రేష్ఠమని కృష్ణుడు తలచెను. యుధిష్ఠిరుడు గూఢచారులవలన దుర్యోధనుడు సంధికి సుముఖుడు కాడనియు యుద్ధముచేయుటకు సేనలు కూర్చుచున్నాడనియు గ్రహించెను. అందుచే ఎటులైనను యుద్ధము తప్పదని తలచి తన తమ్ములను రాజుల సహాయ మర్థించుటకు పంపెను. అర్జునుడు శ్రీకృష్ణుని సహాయము కోరుటకు ద్వారకకు బోయెను. కృష్ణుడు శయనించి యుండెను. తలపైపున దుర్యోధనుడు ఆసీనుడై యుండెను. అర్జునుడు వచ్చి కృష్ణుని పాదముల చెంత గూర్చుండెను. నిద్రలేచిన కృష్ణు డమాంతము అర్జునుని జూచెను. పిదప దుర్యోధనుని జూచెను. ఇద్దఱును సహాయముకొఱకే వచ్చిరి. కావున కృష్ణు డిరువుర కును సాయపడ దలచెను. యుద్ధము చేయక కేవల మాలోచనము చెప్పు

టకు తా నొక్క డొక భాగముగను తొమ్మిది లక్షల యాదవవీరు లొక భాగముగను ఏర్పఱచి మొదట చూడబడినవా డగుటచే అర్జునుని దిక్కై నీ కే భాగము కావలయునో కోరుకొమ్మనెను. అర్జునుడు శ్రీకృష్ణుని కోరుకొనెను. దుర్యోధనుడు తొమ్మిది లక్షల సైన్యము తన భాగమునకు వచ్చినదని మహాసంతోషముతోడనే పోయెను.

కృష్ణార్జునులు కలసి విరటుని ఆస్థానములో నున్న యుధిష్ఠిరుని చెంతకు వచ్చిరి. యుధిష్ఠిరుని అభ్యర్థనముపై కృష్ణుడు హస్తినాపురమునకు రాయబారిగా ఇరుపార్శ్వములకు సంధి కుదుర్చుటకు ఏగెను. ఆ దివ్య పురుషుని జూచి అంధరాజు విదురాదిమంత్రులు ఆదరముతో గౌరవించిరి. కాని దుష్టుడైన దుర్యోధనుడు తనకు తోడునీడలైన శకుని దుశ్శాసన కర్ణులతో ఆలోచించి రాయబారి యని యైనను పాటించక కృష్ణుని బంధింప దలచెను. ఈ విషయము కృష్ణునకు తెలిసెను. అందువలన భోజనమునకు దుర్యోధనుడు తన హర్మ్యమున కాహ్వానించినను పోక విదురుని కుటీరమునకు బోయెను. పిదప సంధి కుదుర్చుటకు కృష్ణుడు చాల యత్నించెను. సూదిమొన మోపదగినంత నేలనైనను ఈయనని దుర్యోధనుడు పట్టు బట్టుటతో రాయబారము విషమించెను. కృష్ణుడు యుధిష్ఠిరుని చెంతకు రా దలచెను. త్రోవలో కర్ణు డగపడగా అతనితో వాని పుట్టుకనాటి రహస్యమును జెప్పి కుంతి కుమారులలో నతడు జ్యేష్ఠు డనియు, ఆమె కన్యయై యుండ సూర్యుని అనుగ్రహమున అతడు పుట్టె ననియు, పాండవపక్షమునకు వచ్చినచో దుర్యోధనవధానంతరము తనకే పట్టాభిషేకము జరుగగలదనియు బోధించెను. కర్ణు డంగీకరించ లేదు. దుష్టదుర్యోధనుని స్నేహములో నున్నను 'దానకర్ణు' డను పేరు తన కున్నది చాలునని కర్ణు డనెను. భారతరాజ్యాంగశాస్త్రమందలి సామ దాన భేద దండము లను చతురుపాయములలో నిది భేదమను నుపాయమునకు దృష్టాంతము. సామ మనగా శాంతి, దాన మనగా ఈవి,

భేద మనగా చీల్చుట, దండ మనగా బలము నుపయోగించుట. కృష్ణుడు మొదటివైన మూ డుపాయముల సంధి పొసగునేమో యని తన శక్తి నంతటి నుపయోగించి చూచెను. వ్యర్థ మయ్యెను. నిష్కారణముగా వసుంధరను రక్తపంకిలము చేయుట వానికి గిట్టనిది. కారుణ్యము ధైర్యము అనుభవము జ్ఞానము వానిలో సమానముగా కలసి యున్నవి. అతడు యుధిష్ఠిరుని యొద్దకు వచ్చి సంధియత్నము విఫలమైన దని చెప్పెను. నాడు భారతదేశమం దున్న మహావీరు లందరితో కూడిన సేన లన్నియు రెండు పక్షముల విభక్తము లైనవి. దుర్యోధనుని వైపున పదకొం డక్షౌహిణులును యుధిష్ఠిరుని పక్షమున ఏడక్షౌహిణులును మొత్తము పదునెనిమిది అక్షౌహిణులును సుప్రసిద్ధమైన కురుక్షేత్రరంగమున చేరినవి.

సంగ్రామసమయ మాసన్న మగుచున్నది. అర్జునుడు రెండు వైపుల నున్న బంధువులను దిలకించెను. తనవారిని చంపుటకు మన సొప్పక నిర్వేదము నొంది యుద్ధము చేయజాలనని శ్రీకృష్ణునితో జెప్పి వాని ఆలోచనము నడిగినాడు. అర్జునునకు రథసారథిగా ఆలోచనకర్తగా నుండుటకు వరించిన కృష్ణుడు వాని దోషమును నిరూపించి విధిని విడ నాడి సుఖము నాసించుచున్నా వని మందలించెను. దుష్టులు ఏ ఉపాయము చేతను వంగనప్పుడు దండోపాయముచేత సంహరింప బడవలెను. శిష్టులను రక్షించుటకు ప్రాణము నైనను అర్పించవలెను. ఈ ధర్మసూక్ష్మ మును అర్జునుడు విస్మరించెను. అందువలన అతడు యుద్ధమునకు విముఖు డయ్యెను. మానవుడు తన విధ్యుక్తధర్మనిర్వహణముకొఱకు స్వీయసుఖముల నన్నింటిని త్యజించవలెను. క్షత్రియుడు ధర్మపక్షమున నిలబడి విజయమును సాధించవలెను. అట్లు చేయుటకు వెనుకంజ వేసినచో అత డధర్మపరు డగును. ఋషుల వాక్యములు పరిశీలించగా పురుషు డెప్పుడును చంపబడుట లేదు. వస్త్రమువలె ధరింపబడుచున్న

ఈ శరీర మను తొడవు జాఱిపోవుచున్నది. దానినే మృత్యు వను చున్నారు. పురుష డనంతుడు శుద్ధుడు. అతడు చేయునది లేదు, కోరునది లేదు. ఆత్మయొక్క నిష్క్రియత్వమును ప్రశాంతిని గమనించిన జ్ఞానులు తమ జీవితలక్ష్యమును జేరుటకు జ్ఞానమార్గము ననుసరింతురు. కాని, కర్మలు చేయక ఎవ్వడును ఒక్క క్షణమైనను ఉండలేడు. అన్న పానముల విషయమునసైనను కర్మలు కన్పట్టుచున్నవి. కావున ఒక్క మాఱుగా కర్మలు విడచుట సులభము కానిది. కర్మలు చేయవలదనుట గాలిని పీల్చవల దనుట వంటిది. అది మానవస్వభావము. మానవుడు ఫలమును దృష్టిలో నుంచుకొనక కర్మ లాచరించవలెను. నేను-నాది అను భావము బంధమునకు హేతువు. ఆ భావమును విడిచిననే ఫలదృష్టి లేక కర్మ లాచరించుట సాధ్యము. ప్రతి వాడును తాను చేయు ప్రతి కర్మలో ఏదో ఫలము నాశించుచునే యుండును. ఆ ఫలముచెన చూడక కర్మా చరణము అసంభవము అనిపించును. ఫలములను స్మరించుచు చేయు కర్మలు వాంఛలను పెంచి బద్ధుడై యున్న మానవుని మఱింత బంధిం చును. కావుననే మానవుడు బంధవిముక్తుడు కా దలచినచో ఫలాపేక్షలేని కర్మాధికారమును కలిగి యుండవలెను. 'కర్మ ణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన'. ఇది అంత తేలిక యయినది కాదు. కావున ఈ కర్మ మార్గము నయితము జ్ఞానమార్గమంత కష్టమయినదిగానే ఆచరణమున గన్పట్టుచున్నది. వాంఛలతోడనే మానవుడు జీవించు చున్నాడు. వాంఛ లను విడువక విముక్తి లేదు. జీవిత మనగా ఇంద్రియములకు దాస్యము. మరణము యొక్క రాకడకు ముందు మానవుడు మరణమును అభ్యసించ వలెను. అనగా సకలవాంఛలకు సమస్తప్రాపంచికభోగములకు మృతుడు కావలెను. ఈ ప్రక్రియకు యోగమార్గము మఱి యొక సాధనము. ఈ సాధనములో తన సకలేంద్రియశక్తులను భ్రూమధ్యమందు కేంద్రీకరించి ప్రాపంచికసంబంధములను మఱువవలెను. ఏ ఊహయు అతని మనసును

కదలించని వేళ, అతని కొక శరీరము కలదను స్మృతియే లేనివేళ పరమశాంతి తప్ప వే తేదియు వాని అంతరంగమును ఆవరించని వేళ, ఒక విశిష్టమైన నిశ్చలానందము వాని అనుభూతికి వచ్చును. ఇంద్రియము లన్నియు అందు విలీనము లగును. కేవలజ్ఞానముచేతనే ఆ ఆనందము అనుభూత మగును. దానినే యోగసిద్ధి అందురు. ప్రకృతిగతులైన వారి కిది సులభసాధ్యము కాదు. ఈ ప్రపంచమును విడిచితి మను భావమే వారు ఏర్పఱచు కొనలేరు. ఆనంద మనగా శబ్దస్పర్శరూపరసగంధముల సంబంధ మనియే వారికి తోచును. వీరికి అసాధ్యమని చెప్పుటచే వీరికి సాధ్యము కాగల మార్గమే లేదా ?

ఈ ప్రశ్నమునకు శ్రీకృష్ణు డర్జునునితో సమాధానము చెప్పు చున్నాడు. 'లేదని యేల ? కలదు. అది రహస్యము. నీవు నాకు ప్రియ మిత్రుడ వగుటచే ఆ రహస్యమును నీకు బహిర్గతము చేయ దలచినాను. నీకు వలెనే నాకును బహుజన్మలు గడచినవి. వాని నన్నింటిని నే నెఱుగుదును; కాని, నీ వెఱుగవు. కారణ మే మనగా, నే నీ దేహ మను గృహమున నివసించువాడ నని తెలిసి యున్నాను. నీవు దేహముతోనే తాదాత్మ్యమును పొంది యున్నావు. అందుచే దానితో బంధింపబడి యున్నావు. రూపరహితుడ నని నే నెఱిగి యుండుటలో నా అనంతత్వము యొక్క జ్ఞానము నిత్యము నా కున్నది. నామరహితుడను రూపరహితు డను అగుటచే అన్ని నామములు అన్ని రూపములు నావే యగుచున్నవి. నేను సూర్యుడను, నేను చంద్రుడను. సమస్తదేవతలు నేను. ఈ విశ్వ మున కధిష్ఠాత యైన దేవుడు నేను. సర్వజ్ఞుడను నేను. సర్వశక్తిమంతు డను నేను. నేను సృష్టికర్తను, స్థితికర్తను, లయకర్తను. నాకంటె పెద్దది గొప్పది మఱొక్కటి లేదు. సర్వకర్మలు నేను చేయుచున్నను, చేయనివాడను. పరిణతి నొందిన నాకు ఏ పని చేయుటకైనను వాంఛ ఏమి ఉండును ? నాలో వాంఛలులేవు. తాత్కాలికముగా గాని శాశ్వతము

గా గాని నా కాద్యంతములు లేవు. దేశకాలముల నతిక్రమించిన వాడను. నే నద్వితీయుడను. కాన నా కంటె గొప్పవా డెవ డుండును ? సుఖదుఃఖ ములు నేను. తీపిచేదులు నేను. మంచిచెడ్డలు నేను. కాని, వీనిలో ఏదియు నేను కాను. అయినను చూడుము. మంచితనము ప్రేమ పవి త్రత నీతి ఇట్లేది ఉత్తమమైనది ఉత్కృష్టమైనది కలదో అది నాకు మిక్కిలి దగ్గఱ. చెడ్డతనము అసూయ అపవిత్రత అవినీతి ఇట్లేది నీచమైనది తుచ్ఛమైనది కలదో అది నాకు బహుదూరము. ఎందు కనగా ఈ రెండవరకము గుణములు మానవుని ఇంద్రియపరునిగా సంకుచిత మనస్కునిగా స్వార్థాభిలాషిగా నొనర్చి వాని నిజమైన దివ్యభావమునుండి దూరము చేసి నా నుండియు బహుదూరమున నుంచును. మొదటి రకము గుణములు అట్లు కాక మానవుని ఇంద్రియపరత్వమును స్వార్థమును తగ్గించి దేహముయొక్క బంధములను క్రమముగా సడలించి, ప్రకృతి బంధముల కతీతుడనై నాయందు వానిని చివరకు విలీనుని చేయును. కావున మంచిది పవిత్రమైనది నీతియుతమైనది ఏ దేది కలదో అట్టిది సర్వము నా అనంతవైభవములోని భాగమే. నీ వే దేది చూచుచున్నావో అది అంతయు నేనే. ఇంకను వాని కతీతుడనుగా గూడ ఉన్నాను.'

ప్రియమైన మిత్రుడు విధేయుడైన శిష్యుడు అగు అర్జునుడు శ్రీకృష్ణుని విశ్వరూపమును చూపుమని ప్రార్థించి వాని అనుగ్రహమునకు పాత్రుడై ఆ రూపములోని విశ్వమును దర్శించ గలిగెను. ఆ దృశ్యము యొక్క అద్భుతవైభవమును మఱి కొంత కాలము చూడలేక పూర్వ మున్న ప్రసన్నసుందరమధురరూపమును తిరిగి ధరింపుమని ప్రార్థించెను. శ్రీకృష్ణుడు అతని ప్రార్థన మంగీకరించి యథాపూర్వముగ నిలచెను. అప్పు డతడు తన మిత్రుని ఇట్లు ప్రశ్నించెను. 'ఏమోయీ! నేను సుందరముగ ఆకర్షణీయముగ లేనా ? స్త్రీ గాని పురుషుడు గాని నన్ను ప్రేమించుట కష్టమా ? నన్ను ప్రేమించుట వలన లాభమా నష్టమా?

ఎవ్వరే విధముగా నన్ను భావించినను వారి వాంఛితమును తీర్చలేనా? నేను సర్వశక్తిమంతుడను కానా? కావున ఉత్తమోత్తమమైనది అతి సులభమైనది అత్యంతాకర్షణీయమైనది మిక్కిలి ఫలప్రద మైనది నన్ను ప్రేమించుట. అర్జునా! నన్ను ప్రేమించుట నేర్చుకొనిన వాడు నేర్వదగిన దంతయు నేర్చినవాడు. ఎట్లో తెలియునా? సమస్త జ్ఞానమును సమస్తానందమును సమస్తజీవనమును ఇచ్చువాడను నేనే. సమస్తవిధులను నన్ను ప్రేమించుటలో విడిచినవాడు మానవు లందరిలో మిక్కిలి తెలివి గలవాడు. నా పాదములచెంత పూర్ణముగ తన నర్పించు కొనిన వానిని సకలదుఃఖములనుండి సముద్ధరింతును. ఇది భక్తిమార్గము. పరమ ఋషిగాని పరమపాపిగాని జ్ఞానిగాని అజ్ఞాని గాని అందరు సమానముగా అనుష్ఠించుట కుద్దేశింపబడిన మార్గ మిది. పూర్ణతను పొందుటకు ఎల్లరకు మార్గ మిది. నేను పూర్ణుడను. కావున సంశయమును వీడుము. యుద్ధమునకు లెమ్ము. నాకొరకే యుద్ధము చేయుము. నేను ధర్మస్వరూపుడను.' అర్జునుడు శ్రీ కృష్ణుని దివ్యోపదేశసహాయముల గొని వీరవరులైన సోదరులతో గలసి కురుక్షేత్ర మహాసంగ్రామమున విజయము సాధించెను. ధర్మము ముందు అధర్మము బలి చేయబడినది. దుర్మార్గము మూర్తిగొన్న దుర్యోధను డంతరించుట తోడనే ధర్మమునకు ప్రాధాన్యత వచ్చినది. లోకమున చిరకాలముగా లేని శాంతి వచ్చినది. దుర్మార్గులు మారుమూలల కొండ గుహలను అరణ్యగర్భములను వెదకికొనుచు పోయిరి. శిష్టులకు దుష్టుల దౌష్ట్యము వలని బాధ భయము లేకుండెను. ప్రకృతిముఖమున ఒక సంతోషము ఒక సౌందర్యము ద్యోతమయ్యెను. జలభూమ్యాకాశములందలి జంతుజాల మంతటి హృదయకుహరములు సంతోషమునే క్రుమ్మరించినవి. శ్రీకృష్ణుడు తన విధిని నిర్వర్తించితి నని భావించెను. పావనుడైన యుధిష్ఠిరుని భారత సింహాపీఠమున అధిష్ఠింప జేయుట ఆయన పిమ్మటి పని.

విజయము లబ్ధమైనది. 'బంధువులు మిత్రులు మహావీరులు ఎందరెందరో నశించిరి. ఇందఱ రక్తము బలి గొన్న ఈ సింహాసనము నాకెందులకు ? నే నే వనభూమికో పోయి ఏకాంతవాసము చేయ దలచినాను. నన్ను పోనిండు.' అని యుధిష్ఠిరుడు తనను సింహాసన మెక్కు మని పిలువ వచ్చిన సోదరులు కృష్ణుడు వ్యాసుడు ఋషులు మొదలైన వారలతో విన్నవించెను. అందఱును బ్రతిమాలిరి. శ్రుతిస్మృతులలోని ప్రమాణ వాక్యములను వినిపించి చివరకు పట్టాభిషేకమునకు సమ్మతింప జేసిరి.

ఈ రీతి శ్రీకృష్ణుడు యుధిష్ఠిరుని భారతచక్రవర్తిగా అభిషేకించి ధర్మరాజ్యప్రతిష్ఠాపనము చేసెను. ధర్మజుని రాజ్యములో శాంతి అభ్యుదయము సంతోషము పుష్కలముగ వెల్లివిరిసెను. దుష్టుల దుష్పరిపాలనమునుండి భరతఖండము తప్పింప బడినది. శాంతుడు పవిత్రమూర్తి ధర్మరూపుడు అయిన యుధిష్ఠిరుని దయార్ద్రహస్తమున నిక్షిప్తమైనది.

అభిషేకమైన మఱునాడు యుధిష్ఠిరుడు ప్రాతఃకాలమున పెందలకడ నిద్రనుండి లేచి నిత్యానుష్ఠానములు నిర్వర్తించుకొని శ్రీకృష్ణుడు శయనించియున్న చోటికి అర్చించ వచ్చెను. శయ్యపై పద్మాసనమున గూర్చుండి ధ్యానమగ్నుడై యున్న కృష్ణుని జూచెను. సమీపమున గూర్చుండెను. కొంత సేపటికి జాగ్రదవస్థకు వచ్చి కన్నులు తెఱచిన కృష్ణుని గని వాని హృదయము నంత తీవ్రముగ నాకర్షించిన రహస్యమేమై యుండు నని యడిగెను. ప్రియమిత్రుని గాంచి కృష్ణు డిట్లనియెను, "నే నింతవఱకు యుద్ధరంగమున నున్న భీష్మునిచెంత నుంటిని. ఆ య్యాచార్యఋషి అంపశయ్యపై నుండి పరమభక్తిపరుడై నన్ను ధ్యానించుచుండెను. అందువలన అట కేగితిని. భీష్మప్రతిజ్ఞుడు మహాజ్ఞాని మహావీరుడు మహాపండితుడు వాఙ్మనఃకర్మలయందు మహాశుద్ధుడు మహానిగ్రహపరుడు అయిన భీష్ముడు ఈ పృథ్విని అభాగ్యను

జేసి వీడి పోవు కాలము సమీపించుచున్నది. వసుంధర కొక దివ్య భూషణము రాలిపో నున్నది. ఆ శంతనుపుత్రుడు మహాపురుషులు తనువులు వీడుటకు శ్రేష్ఠమైన ఉత్తరాయణపుణ్యకాలము కొఱకు ఎదురు చూచుచున్నాడు. ఆయన శరీరమున గ్రుచ్చుకొని యున్న సందులేని వాడి బాణములు అసంఖ్యాకములుగా నున్నను బాధను భరించుచు ఒక్క బాణమే ప్రాణము నపహరించగలిగిన దైనను అన్నింటి శక్తిని నిరోధించి, తన యిచ్ఛవచ్చినప్పుడు మరణించగలవా డగుటచే భీష్మ డింకను ఏబదియాఱు దినములు జీవించ దలచినాడు. కావున ధర్మజా! ఈ దివ్యమైన అపూర్వావకాశమును జాఱవిడువకుము. ఆయననుండి తెలిసి కొనవలసిన దంతయు తెలిసికొనుము. నీ సంశయములను నివారింప జేసి కొనుము. చికాకు నొందియున్న నీ చిత్తమునకు వాని మూలమున స్వాస్థ్యమును బొందింపుము. మన మందఱము ఆయనచెంత కేగుదము. అవసాన దినము వఱకును ప్రతిదినమును పోయి ఆయన చెప్పున దంతయు విని వచ్చుచుందము.'' అనెను. ఈ రీతిగా బలికిన కృష్ణుని వాక్యములకు యుధిష్ఠిరుని హృదయము కృతజ్ఞతతో పొంగి పోయినది. అప్పు డనెను. ''సకలజగజ్జీవములకు సమాశ్వాసము గూర్చు నో స్వామీ! నా కింతకంటె కావలసిన దే మున్నది? నీయం దత్యంతభక్తి గల ఆ పితామహుని అనుపమజీవితము యొక్క అవసానవేళ నీ దివ్యదర్శనము సంప్రాప్తించుట ఎట్టి అదృష్టము! అద్వితీయుడవైన నీవు రక్షకుడ వగుటచే ఆ గంగాసుతుడును మేమును గొప్ప అదృష్టవంతులము!'' ఇట్లని యుధిష్ఠిరుడు కురుక్షేత్రరంగస్థలికి బోవ రథముల నన్నింటిని సిద్ధము చేసి తెండని ఆజ్ఞ లిచ్చెను. శ్రీకృష్ణుడు పంచపాండవులు రథము లెక్కిరి. వీరభటవర్గము వెంట నుండెను. సామంతనృపులు అనుగమించిరి. అనతికాలమున అచ్చోటు చేరిరి. దూరమున రథములు దిగి నిశ్శబ్దముగ భీష్ముని పటకుటీరముదెస బోవుచుండిరి. ఇరుపార్శ్వముల యందును

ఎల్ల యెడల ఆ యుద్ధరంగమున చచ్చి పడి యన్న వీరవరుల కళే బరములనుండి వచ్చుచున్న దుర్గంధము నాసాపుటములకు పీల్చ దుర్భర మయ్యెను. తెగిపడిన తలలు మొండెములు భిన్నభిన్నావయవములు గ్రద్దలచేతను రాబందులచేతను పీకబడుచు భక్షింపబడుచుండెను. కృష్ణుడు ముం దుండెను. వారు భీష్ముని జేరిరి. కృష్ణు డిట్లనెను, "గంగాసుతా! ఈ దుర్భరబాధామయశరశయనమున నీ మనస్సు నేకాగ్రముగ నుంచగలుగుచున్నావా? నీవు తప్ప ఇం కెవ్వరును ఇట్టి ఘోరబాధను ఒక్క క్షణమైనను భరించలేరు. ప్రశాంతముగ ఈ తీరున త్రుటులు గడపుచు ఉత్తరాయణపుణ్యకాలమున కెదురుచూచుచున్నావు. ఇంకను ఏబది యాఱు రోజుల కాల మున్నది. నిన్ను బూజింప నిరుగో పాండవులు వచ్చి యున్నారు. రాజధర్మములు ఆశ్రమధర్మములు ఇంకను గల అనేకధర్మములు ధర్మసూక్ష్మములు నీ నుండి తెలిసికొన వచ్చిరి. సందేహములు నివారించుకొన వచ్చిరి. నీతో సకలజ్ఞానము సమస్త పవిత్రత అంతరించి పోగలవు. నీ స్థితి ఎట్లున్నది?"

మధురములైన ఇట్టి మాటలను తన హృదయపీఠమున నెలకొని యుండు శ్రీకృష్ణభగవానుడు ప్రత్యక్షముగ వచ్చి పల్కుచుండుట విని భీష్మునికి అనంతమైన ఆనందము ఉప్పొంగినది. కన్నులవెంట బాష్ప ధారలు అవిరళముగ కాఱసాగినవి. అప్పు డనినాడు, "అభివాదములు ఆత్మబంధూ! నీ మధురధ్వని మరణించిన వానికి ప్రాణములు పోయును. నీ మధురాత్మను దర్శించు భాగ్యమును అభివాంఛించి యుంటిని. ఈ నా కండరములలోని బాధ దుర్భరముగా నున్నది. ఈ బాణములు నా ప్రాణకూపములను జొచ్చి వేధించుచున్నవి. నా నాలుక దాహమున తపించి ఎండి పోవుచున్నది. నా మెదడు మాంద్యము వహించుచున్నది. నా భావములపై నా కాధిపత్యము లేకున్నది. కొద్ది సేపయినను మాట లాడుటకు నాకు వశము కాకున్నది." భీష్ముని ఈ మాటలు విని కృష్ణుడు

పలికెను. "ఇట్టి పట్టున నైనను నీ మనస్సు వినిర్మలముగా నుండుగాక! ఈ క్షణమే ఈ నీ శరీరమందలి బాధ లన్నియు తొలగుగాక! నీలో శాంతి ఆనందము తాండవించుగాక! నీ అవసానపర్యంతము ఈ స్థితి నిన్ను వీడకుండు గాక!" శ్రీకృష్ణు డీమాట లుచ్చరించిన తోడనే భీష్ముని బాధ లన్నియు దూరమైనవి. భీష్ము డి ట్లనెను "కృష్ణా! ఎంత ఆనంద మబ్బినది! నీ భక్తులయెడ నీ అనంతవాత్సల్య మట్టిది. అనామకుడనైన నేను నీకు దాసానుదాసుడను. ఇట్టి నన్ను పాండుపుత్రుల కేమి బోధింపు మందువు? సర్వజ్ఞుడవు. ఈ విశ్వమునకు ఈశ్వరుడవు. నీముందు నే నెంత ? సూర్యునిముందు మిణుగురుపురుగుపలె కూడ కాని వాడను. వారలకు నీవే బోధించుము. నా కేమి తెలియును? నే నేమి బోధించ గలను?" ఇట్లాడిన భీష్మునితో కృష్ణు డనుచున్నాడు. "పూర్ణచంద్రుడు మనోహరుడు ఆహ్లాదకరుడు. అది వాని స్వభావము. అట్లు కాక ఇంకొక తీరుగా ఉండజాలడు. అందు ప్రత్యేకత లేదు. సర్వేశ్వరుడను సర్వజ్ఞుడను అయిన నేను జ్ఞానవాక్యములు పలుకుటలో వింత లేదు. కాని మానవుని నోటినుండి జ్ఞానవాక్యములు వెడలినచో అవి జిజ్ఞాసువుల అజ్ఞానాంధకారమును భేదించగలవు. అదియే ఆశ్చర్యము. నాప వాక్కు-వు నీ వగుము. వైభవముతో విరాజిల్లుము. ఈ నా మాట లాలింపుము. ఈ జగము నిల్చునంత కాలము పాండవులకు నీ వీ చెప్పబోవు బోధ నము మానవానీక మంతటికిని మార్గదర్శకముగా ధ్రువతారగా నుండ గలదు." శ్రీకృష్ణుని వాక్యములు విని భీష్ము డనెను "స్వామీ! నీ ఆజ్ఞ శిరసావహించగలను. నీ చేతిలో నే నొక సాధనమాత్రుడను. నీ యిచ్చ వచ్చినట్లు నడుపుము. వారికి బోధించుటకు సంసిద్ధుడను. నాయనలారా! రండు. సమీపమునకు రండు. మీ కేమి కావలయునో అడుగుడు." భీష్ము డి ట్లనుట తోడనే యుధిష్ఠిరాదులయిన పాండవులు పితామహుని చెంతకు వచ్చి సాష్టాంగదండప్రణామము లాచరించిరి. కృష్ణు డనినాడు, "భీష్మా

చార్యా! ఈ పాండవాగ్రజుడు సింహాసనమును గొనుటకు మహాత్ముల నందఱిని చంపవలసివచ్చిన దని కలగుండు పడి యున్నాడు. ఆ భావమే భారమై వాని హృదయము నావరించి యుండుటచే నీ ముందగపడుటకు సిగ్గుపడుచున్నాడు. కావున మధురోత్సాహకరవచస్సుల నాతని నూఱడింపుము. వాని చికాకును తొలగింపుము. క్షత్రియోచితమైన ధర్మమును నిర్వర్తించుటలో అధర్మ మేమియు ఒనర్చలేదని వానికి నాటజెప్పుము.''

ఇది విని భీష్ముడు యుధిష్ఠిరుని తనచెంతకు బిలిచి చెప్పెను, "నాయనా! నీ పసితనమునుండియు నిన్ను నే నెఱుగుదును. ఆదినుండియు నిర్మలమైన బుద్ధిగలవాడవు. దాతవు. ఇట్టి నీవు చెడ్డపని నేల చేతువు? తెలివి కలవాడవు. ప్రపంచమున మానవరూపమున అవతరించిన పరమాత్మ నీకు ఆప్తమిత్రుడై మార్గదర్శకుడుగా నుండగా సాగిపోవువాడవు. ఇట్టివారు మీరు వండ్రీ! అధర్మ మేల చేతురు? కావున లేని పోని ఊహలు కల్పించుకొని విచారము నొందకుడు. నాయనా! పోయి సామ్రాజ్యమును ధర్మయుక్తముగా పరిపాలించుము. సుఖశాంతులను నేల నాలుగు చెఱగుల వర్షించుము." ఇట్లు ఊఱటమాటలు పల్కిన పితామహుని పవిత్రపాదములకు సోదరయుక్తుడై యుధిష్ఠిరుడు శిరసాన్చి సవినయముగ నమస్కరించెను. అప్పుడు కృష్ణు డనినాడు, "భీష్మాచార్యా! నీవు తప్ప అన్యులు చెప్పలేని సత్యములు ధర్మములు నీ నుండి వినుటకు ప్రత్యహము క్రమము తప్పక రాగలము. ఈ ఋషులు నీ సన్నిధానమును నిరంతరముగా విడనాడ కుందురు. వీరి సాహచర్యమున మహాఋషుల కనుభూతమగు తృప్తి నీకు ప్రాప్తమగును. శాంత్యానందములు నిన్నెనయు గాక!" ఇట్లు వచించి శ్రీకృష్ణుడు పాండవులతో కూడి పరివారసమేతుడై తిరిగి హస్తినాపురమునకు వచ్చెను. నాడు మొదలు ఏబదియాఱు దినములు నిత్యము భీష్మపాలికి వారంచఱు పోయి ఆయన చెప్పు అమూల్య విషయములు విని వచ్చుచుండిరి. నియతకాల మరుదెంచినది. భీష్ముడు

తనువును చాలించి, స్వర్గమందు తన తొంటిదైన అష్టవసువులలో అగ్రాసనాధిపత్యమును తిరిగి పొందిన వాడాయెను. ఆయన యుధిష్ఠిరాదులకు సంతృప్తి కలుగునట్లు సకలధర్మములను ఎల్ల మానవు లనుష్ఠించవలసిన వానిని విశదముగా అభివర్ణించి చెప్పెను. యుధిష్ఠిరుని వైభవము దాని శిఖరము నందుకొనినది. అజేయులైన తమ్ములతో శ్రీకృష్ణునితో కూడి సామ్రాజ్యమును మహాసమర్థతతో పాలించుచుండెను. ప్రజలు వాని నెక్కుడు ప్రేమించసాగిరి. ఎల్లయెడల శాంతి నెలకొనినది. క్షామముగాని అకాల మృత్యువుగాని వాని రాజ్యమును ప్రవేశించకుండెను. భూమి సస్యశ్యామలయై సమృద్ధిగ పంటల నిచ్చుచుండెను. సుందరసుగంధసుమజాతముతో మధురరసభరఫలసంతానముతో మనోహరముగ నుండెను. శీతోష్ణములు సమముగా ఆహ్లాదకరముగా నుండెను. వర్షములు సకాలమునకు గురియుచుండెను. పృథివి సస్యశాద్వలలతాతరుశోభితయై అలంకరించుకొనిన వనితవలె రాజిల్లి తగిన వాని దీ నేల అనునట్లు విరాజిల్లెను. ఇట్లు కొంత కాలము చక్కగనే జరిగినది. కాని, తిరిగి యుధిష్ఠిరుని హృదయమున విచారము క్రమ్మినది. సింహాసనమున గూర్చుండి ఆ సింహాసన మెంత రక్తపాతమునకు కారణభూతమైనదో స్మరించ సాగెను. సహజముగా మెత్తని హృదయము కలవాడగుటచే ఉత్తములైన అనేకుల రక్తముతో సంపాదింపబడిన ఆ రాజభోగములు తా ననుభవించుట భావ్యము కాదని తలచెను. అందుచే మరల అడవికి పోయి మునివృత్తితో తుదికాలమును గడపు కోర్కెను వెలిబుచ్చెను. ఇది తెలిసి కృష్ణుడతని జేరి మృదుమధురముగ అతని భావములోని మిథ్యాత్వమును విశదపఱచెను. "ధర్మజా! రెండు విధములయిన వ్యాధులున్నవి. ఒకటి శారీరకము, రెండవది మానసికము. శీతలత్వము గాని ఉష్ణత్వముగాని పరిమాణమును మీఱి నపుడు శరీరమున వ్యాధి ప్రవేశించును. ఆ అతిక్రమణమును నిరోధించి సమాన స్థాయికి తీసికొని వచ్చినగాని ఆ వ్యాధి తగ్గదు. ఇక మనసునకు

మూడు తీరు లున్నవి - భోగము, దుఃఖము, మాంద్యము. ఒకడు మిక్కిలి సుఖములో నున్నను దుఃఖములో నున్నను మాంద్యములో నున్నను మానసికవ్యాధిగ్రస్తు డగును. అప్పుడా మానసికస్థితిని సమానస్థాయికి తేవలెను. అందుల కతనికి తద్వ్యతిరేకములను మనోవీధికి తీసికొని రావలెను. మితిమీఱిన సుఖముపలని వ్యాధిని సరిచేయవలయు నన్న సుఖముయొక్క అనంతరము దుఃఖ మెప్పుడును సిద్ధ మగునని స్మరించవలెను. ఇట్లే తక్కినవి ఊహించవలెను. ఈ మానసికవ్యాధులను ఎవనికి వాడే సరిచేసికొనవలయును గాని ఇతరు డెవడును సహాయముచేయుటకు వీ లుండదు. ఏ స్నేహితుడును ఆదుకొనువాడు లేడు. దుర్మార్గులను వారికి సహాయము చేసిన వారిని సంహరించుటలో క్షత్రియోచితమైన విధ్యుక్త ధర్మమునే నిర్వర్తించితివి. ఇది సరిగా నీ వర్థము చేసికొనక పాపము నొనర్చితి నని ఖేదము నొందుచున్నావు. ఇదివఱకు యుద్ధరంగమున ఆ భీష్మునితో ద్రోణునితో వీరవరులతో పోరాడి జయము బడసితివి. ఇప్పుడు నీలోన నీవే యుద్ధమాడుచున్నావు. ఈ యుద్ధమున మిత్రులు భటులు ఆయుధములు నిరర్థకములు. నీ రణమున నీ వొంటరిగనే విజయము సాధించవలసి యున్నది. తప్పు భావముల బొంది అపమార్గముల బట్టకుము.

అడుగడుగునను ని న్నావరించి బాధించుచున్న ఈ మనోవ్యాధికి నే నొక చికిత్సను తెలుపుచున్నాను వినుము. వ్యాసు డిదివఱకే అశ్వమేధ యాగమును చేయు మని నీ కుపదేశించి యున్నాడుకదా ! నాకుకూడ నీ వా యాగమును చేయవలయునని యున్నది. క్షత్త్రియుడు పరిశుద్ధు డగుటకు అంతకు మించినది లేదు. అందు సకలదేవతలు సర్వేశ్వరుడు చక్కగ ఆరాధింపబడుదురు.'' ఇట్లు పలికిన మిత్రుడు దేశికుడు అయిన కృష్ణుని ఆదేశమును యుధిష్ఠిరుడు మనసున నిలిపెను.

శ్రీకృష్ణుని మధురబోధ వాని హృదయమున శాంతిని కూర్చినది. ప్రేమగల తండ్రి గృహమును పాలించినట్లు యుధిష్ఠిరుడు హస్తినాపుర మున సింహాసనమున గూర్చుండి తమ్ములతో గూడి ప్రపంచమును చక్కగా పాలించెను. ఎల్ల రాజ్యమున సుఖశాంతులు తాండవించినవి. కృష్ణార్జునులు కలసి అనేకపుణ్యక్షేత్రములు పర్వతములు నదీనదములు వనాంతరాళములు విలాసముగ దర్శించుచుండిరి. సుఖముగ దిరుగుచు సంతోషముగ సంభా షించుకొనుచు తిరిగి తిరిగి ఖాండవప్రస్థమందలి మయసభాభవనమునకు జేరి కొంతకాల ముండిరి. ఒకనా డర్జునుడు కృష్ణుని జూచి "కృష్ణా! కురుక్షేత్రమున ఉభయసేనల మధ్య ఆ నాడు నీవు నా కుపదేశించిన దివ్యోప దేశములు చాలవఱకు మఱచిపోతిని. వానిని మరల నొక సారి చెప్పుము" అనెను.అందులకు కృష్ణుడు నవ్వుచునే అర్జునుని మందలించి "అర్జునా! వాని నంత తేలికగ జూడవచ్చునా? జీవితమున 'అతిముఖ్యముగ జూడవలసిన వానిని తగినట్లు పాటించవైతివి. అది యొక దివ్యముహూర్తము. కాన అట్లు వచించితిని. ఆ రీతి మరల చెప్పలేను. జననమరణసంబంధమైన దుఃఖబంధములనుండి ముక్తుడవు కా గోరుదువేని నేను చెప్పబోవునది చక్కగ ఆలకించుము. పూర్వమువలె కాకున్నను అట్టిదే మఱొక అంశ మును గూర్చి చెప్పెదను. జాగరూకుడవై వినుము" అని పలికెను. ఇట్లు జరిగిన కృష్ణార్జునుల భాషణమును 'అనుగీత' అందురు. పూర్వ మొక బ్రాహ్మణుడు కృష్ణునకు చెప్పిన ఉపదేశవాక్యమును ఆయన మరల వివరించి చెప్పెను. ఆ సందర్భమున ఒక బ్రాహ్మణీ బ్రహ్మణుల కథను, ఆలంకారికమైన ఆ కథామధ్యమున, అలర్కుడను రాజుయొక్క చరిత మును బోధించెను. అలర్కుడు భూమినంతటిని జయించి విజేతయై కూర్చుండి చింతించగా ఇక నొక్క శత్రువు జయింప బడవలసి యుండె నట. ఆ శత్రువు అతనిని మోసము చేయుచుండెనట. అది వానిమనస్సు. అందుచే దానిని జయించుట కతడు ఇట్లనుకొనెను-'నా నిరంతరవిజయము

వలన నా మనసు పట్టరానంతగా ఉప్పొంగినది. దానికి విశ్రాంతి లేకున్నది. నా కే మాత్రము విధేయముగా నుండుట లేదు. నేను దీనిని జయించిన గాని విజేతను కాజాలను. కావున నా వాడిగల అస్త్రశస్త్రము లన్నింటిని దానివైపు గుఱి పెట్టెదను' అని, అత డొక బాణమును తన మనస్సునకు సూటిగా జూపెను. అప్పుడు అతని మన స్సనినది- 'ఓ యీ అలర్కా! ఇట్టి బాణము లేవియును న న్నే మాత్రము కదల్పలేవు. అవి శరీరమును గాయపఱచి నీకే బాధను గూర్చును. కావున నన్ను జయించ గోరుదువేని మఱి యొక విధమయిన ఆయుధములను వెదకి వానితో యత్నింపుము'అని. అంత నా రాజు బాణమును నాసికవైపు జూపి 'ఈ ముక్కు అనేకపరిమళద్రవ్యముల నాఘ్రాణించుచున్నది. ఆపై నాలో వానిని నిరంతరముగా నాఘ్రాణించుటకు వాంఛలను రేకెత్తించు చున్నది. ఈ ప్రకారము వాంఛలకు జీవితాంతము దాసునిగా నొనర్చు చున్నది. కావున దీనిని పరిమార్చవలయును' అనెను. అప్పుడు నాసిక మనసు చెప్పినట్లే చెప్పినది. అంత నలర్కుడు జిహ్వావైపు బాణమును జూపి 'ఈ నాలుక మధురపదార్థములను రుచి జూచి దాని తీఱని తృష్ణతో నిరంతరము అవి కావలయునని వాంఛించుచున్నది. కావున దీనిని పరి మార్చవలయును'అనెను. అదియును నాసిక చెప్పినట్లే చెప్పినది. అంతట చర్మమువైపు బాణమును జూపి పూర్వ మట్లే పలికెను. అదియును నాసి కాదులవలెనే ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లే నేత్రములు కర్ణములు వ్యవహ రింపబడినవి. అప్పు డలర్కు డనుకొనెను - 'నాకు దుష్టమైన ఆలోచ నము చెప్పునది ఈ బుద్ధి. ఇది ఎప్పుడును చెడ్డతీర్మానములే చేయు చుండును. దీని బరిమార్చెదను'అని. బుద్ధియు వెనుకటి వానివలెనే బదులు చెప్పెను. అప్పు డలర్కుడు తన అయోమయాస్త్రశస్త్రములు నిరర్థక ములని తలచి తగిన ఆయుధము కొఱకు విచారించ సాగెను. తనలోనే దానికై వెదకజొచ్చెను. ఈరీతి అతడు అంతస్సులో మనోజయము గోరి

గ్రతతో వెతకగా వెతకగా ఆ ఏకాగ్రతయే అతనికి తగిన ఆయుధముగా దోచెను. దాని మూలమున అతడు మనస్సును జయించెను. మనస్సుతో పాటు ఇంద్రియములు సయితము జయింపబడినవి. ఈ విషయము ననుభవమువలన నెఱింగి యోగియై ముక్తు డయ్యెను. తన విజయమునకు తానే ఆశ్చర్య మొంది ఇట్లు పలికెను-'ఔరా! ఇంద్రియములకు కావలసినవి కూర్చుకొనిన పిమ్మట గూడ మన జీవితములందలి చాల కాలమును ఎక్కడో వెతకుచు మన నుండి దూరమై పోదుము. మానవునకు నిజమైన సుఖము కావలయు నన్న తనయందు తాను విలీనుడు కావలెను.'

ఈ అలంకారికమైన ఆఖ్యానము ముగిసిన పిమ్మట అర్జును డడిగెను. 'కృష్ణా! ఆ బ్రాహ్మణు డెవడు? ఆ బ్రాహ్మణి ఎవ్వతె?' కృష్ణు డనెను- 'ఓయీ! నా మనస్సు బ్రాహ్మణుడు. నా బుద్ధి బ్రాహ్మణి. కృష్ణుడను సర్వజ్ఞుడను నేనే.'

అంతట కృష్ణుడు మఱి యొక కథను చెప్పసాగెను. అది గురు శిష్యుల కథ. అనేక వేదాంత విషయము లా కథవలన సులభముగా తెలుపబడినవి. కథ ముగిసిన పిమ్మట అర్జునుడు శ్రీకృష్ణు నడిగెను 'ఆ గురు వెవరు? ఆ శిష్యు డెవరు?' అని. మహాకవి యైన కృష్ణు డనెను 'నేను గురువును. నా మనస్సే శిష్యుడు' అని.

కొంతకాలము ఖాండవప్రస్థమున గడపిన పిమ్మట శ్రీకృష్ణుడు తన రాజ్యమునకు పో దలచెను. అందులకు యుధిష్ఠిరు ననుమతి బడయుటకు ఇరువురు హస్తినాపురమునకు వచ్చిరి. రాజు విధిలేక అనుమతించెను. కృష్ణుని విడచుటకు ఆయనకు కష్ట మనిపించెను. కృష్ణుడు తన కిష్టుడైన సాత్యకిని వెంట బెట్టుకొని ద్వారకకు పయనమయ్యెను. త్రోవలో ఎడారినేల వసించుచున్న ఉదంకు డను ఋషిని గని పూజించెను. ఉదంకునకు బాహ్యవిషయము లేవియు తెలియవు. ఆయన

ఎప్పుడును తనలోననే విలీనుడై యుండు వాడు. అతడు కౌరవపాండవ వంశములకు మిత్రుడు. రెండు పక్షముల వారికి ఏర్పడిన భేదమునందు సంధి కుదుర్చుటకు శ్రీకృష్ణుడు యత్నము చేయుచుండిన విషయము నత డెఱుగును. వాసుదేవుని దివ్యశక్తిలో అతనికి గొప్ప విశ్వాసము కలదు. అందుచే కృష్ణు డగపడుటతోడనే ఇరుదెసల వారికి సంధి కుదిరినదా అని అడిగెను. సంధి పొసగలేదనియు యుద్ధము సంభవమై భారతవీరు లనేకులు హతులై రనియు కృష్ణుడు చెప్పుటతోడనే అతనికి మిక్కుటమగు కోపము వచ్చెను. సంధి కుదుర్చుటలో కృష్ణుడు అశ్రద్ధ చేసి యుండుననియు సంధి కుదిరి యుండినచో అనేకవీరవరుల ప్రాణములు దక్కి యుండెడి వనియు పల్కుచు కృష్ణుని శపింప నుద్యుక్తు డయ్యెను. అప్పుడు కృష్ణుడు వాని నించుక శాంతింపు మని, నిజస్థితులు పూస గ్రుచ్చి నటుల చెప్పి, దుష్టులైన వారిని భూమినుండి తొలగించిననే గాని శిష్టులు బ్రతకలేని స్థితి ఏర్పడిన దనియు, కలుపు మొక్కలను పీకి వైచిన గాని పైరు చక్కగా పెరిగి ఫలించ దనియు విశదము చేసెను. ఆ పిమ్మట ఉదంకుడు శ్రీకృష్ణు డవతారపురుషు డని గ్రహించి వానిని విశ్వ రూపము జూపు మని ప్రార్థించెను. శ్రీకృష్ణు డుదంకునియం దనుగ్రహము గొన్నవాడై యుద్ధరంగమున అర్జునునకు జూపినట్లు ఉదంకునకు విశ్వరూపప్రదర్శనము చేసెను. అది గని మహానందము నొంది ఆపై తనలో తాను యథాపూర్వముగ విలీను డయ్యెను.

ఆ తరువాత శ్రీకృష్ణుడు ద్వారకకు జేరి తల్లిదండ్రులతో బంధువులతో కుటుంబముతో మిత్రులతో నుండి వారి లోపములను దుఃఖములను నివారించి సుఖమున నుండెను. ద్వారక సంతోషమును పండించి నిత్యోత్సవముల దేలి యాడుచుండెను. కొన్ని నెలలు గడచి నవి. ఒకనాడు హస్తినాపురమునుండి రాయబారి ఒక డరుదెంచి యుధిష్ఠిరు డశ్వమేధయాగము చేయబోవుచున్నా డనియు సమస్త

యాదవులతో గూడి రామకృష్ణులను రమ్మనినా డనియు చెప్పెను. ఈ వార్త క్షణకాలమున ద్వారకయం దంతటను వ్యాపించినది. హస్తినాపురమునకు బోవ యాదవులు ప్రయాణసన్నాహములు బ్రహ్మాండముగ జేయసాగిరి. వృద్ధులు వికలాంగులు తప్ప ఎల్లరు బయల్వెడలి హర్షాతిరేకమున పొంగుచు హస్తినాపురము జేరిరి. వీరి రాకకు ఎదురుచూచుచున్న యుధిష్ఠిరుడు యాదవుల గాంచి మహాసంతోషమున స్వాగతమిచ్చెను.

నగరాధిరాజమైన హస్తినాపురము చక్కగ నలంకరింపబడియుండెను. శ్రీకృష్ణుడు యాదవులతో గూడి నగరప్రవేశ మైనది మొదలు వానిపై నగరకాంతలు హర్మ్యతలములనుండి పూల జల్లులు కురిపింప సాగిరి. మందహాసములతో అపాంగవీక్షణములతో పురకాంత లిచ్చు నీరాజనములను సుమదామములను చిఱునవ్వున స్వీకరించుచు దివ్యసుందరవిగ్రహు డా కృష్ణుడు నగరవీధుల నడుమ సాగెను. వీధులయందు పరిమళద్రవ్యములు పుష్పములు చల్లబడి యుండెను. ఎచ్చట చూచినను పచ్చని ఆకులతో చిత్రవిచిత్రములుగ తోరణములు అలంకరింపబడియుండెను.తోరణములక్రింద త్రోవ వెంట నంతట మంగళవాద్యములు శ్రవణపేయముగ సుమనోహరముగ మ్రోగింపబడు చుండెను.నగరమున ప్రతిగృహమున శుభకార్యము లొక్కుమ్మడి జరుగుచున్నట్లు శోభిల్లెను. ఆ శోభలో కృష్ణుడు ప్రవేశించెను.ఆ శోభ వేయి రెట్లు పెరిగి ప్రకాశించెను. స్వర్గమునకంటె పృథివియే మిగుల సుందర మనిపించెను. సర్వేశ్వరునితో కూడిన హస్తినాపురము ఇంద్రనగరమును మించెను. మిగిలిన పాండుపుత్రులు నలుగురును హస్తినాపురమున లేకుండిరి.వారు శత్రురాజ్యములను వశపఱచుకొనుటకు వెడలియుండిరి. శ్రీకృష్ణు డరుదెంచుటతోడనే అభిమన్యుని భార్య ఉత్తర ఒక మృతశిశువును కని యుండెను. రాజకుటుంబ మంతయు దుఃఖమగ్న మైనది. కృష్ణు డా శిశువును సజీవుని జేసెను.

రాచనగరు సంతోషతరంగిత మైనది. తర్వాత భీమార్జుననకులసహదేవులు నలుగురును నాలుగు దిక్కులనుండియు అపారధనరాసులను వెంట గొని జయశీలురై వచ్చిరి. వారు శ్రీకృష్ణుని గని నమస్కరించి తమ ఏకైక వంశాంకురము వానిచే సజీవము గావింపబడుట విని సంతసమున దేలి యాడిరి. అశ్వమేధ యాగము మహావైభవముగ మహోత్కృష్టముగ కొనసాగింపబడినది. ధర్మముయొక్క అవతారమైన యుధిష్ఠిరుడు మహోన్నతవైభవము నందుకొని యుండెను. భగవానుడైన శ్రీకృష్ణుని అనుగ్రహఫల మది. అంత నా దివ్యసోదరులు రామకృష్ణులు తిరిగి ద్వారకను జేరి ప్రశాంతముగ సర్వసంతోషముగ ప్రజాపాలనము జేయ సాగిరి. మధురమూర్తులయిన వారి కథ నింతతో ఆపుదము.

ఈ సమస్తదృశ్యజగత్తునకు ఆత్మయై వెలుగొందు శ్రీకృష్ణ భగవానుడు ఉత్తమోత్తమమైన విశ్వమతమును ప్రసాదించినాడు. ఉప నిషత్తులలోని మహాసత్యములను వెలికి దీసి ఆకర్షణీయముగ సులభముగ ప్రజలలో వ్యాప్తి గలిగించినాడు. సమవర్తిత్వమును ప్రదర్శించు వాని ఔన్నత్య మీ నాటికిని కీర్తింపబడుచున్నది. ఒక ఋషిని ఒక పాపిని సమముగా నతడు చూడగలడు. శాశ్వతమైన మతమును నిర్మించిన వా డతడు. ప్రపంచమునం దన్ని మతములలో నగ్రస్థాన మందుటకు వాని మతమునగల వినిర్మలవిశాలభావమే కారణము. మన మాయన కేమి కృతజ్ఞత జూపగలము? విశ్వాసభక్తిప్రేమలను పుష్పముల వాని నర్చించువాడు అదృష్టవంతుడు. అట్టివాడు ఇహముననే కాక శాశ్వతముగ సుఖము నందగలడు. ఆయన ఆశీస్సులు మనపై నిరంతరము ప్రసరించు గాక! మనలను బిడ్డలనుగా అతడు స్వీకరించును గాక! మన మత డొక్కడే రక్షకుడని భావింతుము గాక! ఆయన మధురమైన అను గ్రహము ప్రేమయుతమైన కటాక్షము దివ్యమైన శాంతిని అనశ్వరమైన ఆనందమును మనపై వర్షించును గాక!

ఓం తత్ సత్